★ श्री कृष्ण रायबारमु ★

# శ్రీ కృష్ణ రాయబారము

(శ్రీమదాంధ్ర మహాభారతము)



प्रकाशक

ప్రకాశకులు

आन्ध्र राष्ट्र हिन्दी प्रचार संघ, विजयवाडा.

ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘము

విజయవాడ

సర్వోదయ గ్రంథమాల — ౩

# శ్రీ కృష్ణరాయబారము

(శ్రీ మదాంధ్ర మహాభారతము)

సంకలనము

కోట సుందరరామశర్మ

వేమూరి ఆంజనేయశర్మ

ప్రకాశకులు

ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘము

విజయవాడ

ప్రతులు 1000
1949

సాహిత్యోపసమితి
శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు
శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు
శ్రీ కో. శఠకోపాచార్యులుగారు

శ్రీ అజంతా అర్టు ప్రింటర్సు,
విజయవాడ.

వెల రు. 1—8—0

# గ్రంథపరిచయము

వేదవ్యాసుడగు ద్వైపాయనమహర్షి అష్టాదశపురాణములను రచించి, పిమ్మట 'జయ'మను మహాభారతసంహితను రచించెను. చంద్ర వంశజులగు రాజులకు భరతునివలన భారతులని పేరువచ్చెను. ఆ భారతులచరిత్రమే ఈగ్రంథమున ప్రధానాంశమైనను ఆదిరాజన్య చరిత్రములును, సర్గప్రతిసర్గమన్వంతర కథనమును ఇందు ప్రసక్తము లగుటచే దీని నితిహాసమనియేగాక బురాణమనియు వాకొనవచ్చును. అంతియేకాదు; అనేక ధర్మముల నుపదేశించుటచే ధర్మశాస్త్రమనియు, రాజనీతి, యుద్ధనీతుల నుపదేశించుటచే నీతిశాస్త్రమనియు, అధ్యాత్మ విద్యోపదేశముచే నిది తత్త్వశాస్త్రమనియు నీ మహాకావ్యము గణుతికెక్కెను. శ్రుతిస్మృతులకు బురాణములకు ఏకవాక్యత కుదరక విరోధమొదవినపట్ల భారతగ్రంథమే ప్రమాణస్థానమై, పంచమ వేద మను గౌరవము నందెను.

కం॥ వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణ వర్గమ్ములకు_
వాదైన చోటులం దా
మూదల ధర్మార్థకామమోక్ష స్థితికిన్."

— తిక్కన, విరాటపర్వం.

## ఆంధ్రభారతము

క్రీస్తుశకం 10, 11 శతాబ్దులనాటికి బౌద్ధజైనములు దక్షిణాపథ మున వ్యాపించి ప్రజలను కర్మనూరులను, నాస్తికుల నొనర్చుచుండెను. వైదికధర్మప్రతిపాదక మగు గ్రంథమంతయు గీర్వాణభాషామయమై ప్రజాసామాన్యమునకు దుర్బోధముగా నుండ బౌద్ధ జైన గ్రంథము లన్నియు ప్రాకృతభాషామయములై ప్రజల కందుబాటులో నుండెను. కావున ప్రజను అవైదికమతములలో బడిపోకుండ రక్షింపవలెనన్న ఆర్య విజ్ఞానమును, దానిసారమును ప్రజ కందింపవలెను. రాజమహేంద్ర వరాధీశ్వరుడగు చళుక్య విష్ణువర్ధనుడు ఈ మహాకావ్యమునాంధ్రీకరింప

యాస్థానపండితుడగు నన్నయభట్టుచే జేయింపనెంచి అర్థవిజ్ఞాన సార మగు మహాభారతమును దెలుగొనర్పుమని ఆ మహాకవిని గోరెను.

## నన్నయభట్టు

'అవిరళ జపహోమతత్పరుడు, నానాపురాణసంహితాభ్యాసుడు, నిత్య సత్యవచనుడు, మత్యమరాధిపాచార్యుడు, ఋషికల్పుడు నగు నన్నయ భారతాంధ్రీకరణ మారంభించి ఆదిసభా పర్వములును, ఆరణ్యపర్వమున గొంతి భాగమును రచించెను.

అష్టభాషావాగనుశాసనుడగు ఈ పండితుడు ఆంధ్రభాషా సంస్కరణమునకై, సంస్కృతమున ఆంధ్రశబ్ద చింతామణి యను సూత్రగ్రంథమును రచించెనందురు. నన్నయ భారతమే ప్రథమాంధ్ర కావ్యమనియు వచింతురు. చింతామణినన్నయకృతముగాదనియు, నన్నయకు బూర్వమే ఆంధ్రకావ్యరచన ముండియుండవలెననియు నేడు వాదోపవాదములు జరుగుచున్నవి. ఇందలి యాథార్థ్య మేటులున్నను నన్నయకు బూర్వమున రచితమగు ఆంధ్ర వ్యాకరణముగాని, ఆంధ్ర కావ్యముగాని ఇంతవరకు లభింపమిచే నన్నయభారతమే సలక్షణమగు ప్రథమాంధ్రకావ్యమని అంగీకరింపవలసియుండును.

వైదిక ధర్మనిష్ఠుడగు యీ మహాకవీశ్వరుని వాక్కు ఋషివాణివలె శ్రుతిపేయమై ఒక్కొక్కచో బ్రౌఢసమ్మితము, మఱొక్కచో మిత్రసమ్మితమునై యొప్పును.

## ఎఱ్ఱన

నన్నయ రచింపగా మిగిలిన ఆరణ్యపర్వమును పూరించిన ఎఱ్ఱాప్రగ్గడ హరివంశమను మహాగ్రంథమును, నృసింహపురాణమునుగూడ రచించెను. ప్రబంధపరమేశ్వరుడని విఖ్యాతిగన్న ఈ కవీశ్వరునకు శంభుదాసుడను నామాంతరముగూడ నున్నది.

"సకలలోకైకవిదితుడయిన నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశప్రశస్తి దన్ను జెందె" ననియు, "నన్నయ కవితారీతియు గొంతదోప, దద్రచనయకా నారణ్యపర్వశేషము – సాధుజన హర్ష సిద్ధి

గోరి, కవీంద్రకర్ణపుటపేయముగా – పూరించితి" ననియు ఎఱ్ఱన తన కవితాప్రజ్ఞను, సౌజన్యమును వెల్లడించుకొన్నాడు. 'తత్కవితారీతియు గొంతదోప' ననుటచే నన్నయ ఆరణ్యపర్వమును పూర్తిచేసియే యుండుననియు, ఎఱ్ఱన గ్రంథపాతములను మాత్రము పూరించె ననియు నూహింపనగును. ఎఱ్ఱనకు బూర్వమందే విరాటపర్వమాదిగా బదునైదుపర్వములు రచించిన తిక్కన నాటికి అరణ్యపర్వ రచన మవశిష్టముగానున్నచో నాతడు దానిని పూరించియేయుండును. తిక్కన యెఱ్ఱనల మధ్యనున్న కాలమున ఆరణ్యపర్వము ఖిలమైయుండుననుటయే సమంజసముగా నుండును.

## తిక్కన

ఆంధ్ర మహాభారతము పదునెన్మిది పర్వములలో విరాట పర్వమాదిగా గల పదునైదు పర్వములు రచించిన తిక్కన నెల్లూరు (విక్రమసింహపురము) ప్రభువగు మనుమసిద్ధికడ మంత్రియు, గవీంద్రుడునై వన్నె కెక్కెను. తిక్కన తండ్రియు, 'గుంటూరి విభుడును' నగు కొమ్మన దండనాథుడును, పెద తండ్రులగు కేతనమల్లన సిద్ధనలును గుంటూరు మండలమున రాజమంత్రులు సేనాపతులునై కార్యఖడ్గములచే, యజనాధ్యయనములచే బ్రశస్తి కెక్కిరి. వీరి యింటిపేరు కొట్టరువువారు. రాజనియోగవశమున వీరు నెల్లూరు మండలమునపాటూరులో తిక్కన కాలమునాటికెనివాస మేర్పరచుకొనిరి.

మనుమసిద్ధి తిక్కనను 'మామా' యని పిలిచెడివాడట. ఆ ప్రభువు కోరికచే తిక్కన చిన్ననాటనే ఉత్తరరామాయణమును నిర్వ చనముగా రచించెను. పిమ్మట యజ్ఞకర్తయై మహాకవిత్వదీక్ష వహించి భారతరచనము సల్పునాటికి తిక్కన సోమయాజి యయ్యెను. ఈతని పెదతండ్రి కొడుకగు తిక్కన మనుమసిద్ధియొద్దనే దండనాథుడై ఖడ్గ తిక్కన యని పేరుగాంచుటచే ఈయన కావ్యతిక్కన యని వాసి కెక్కెను.

ఆకాలమున గణపతిరుద్రదేవగజపతి ఓరుగల్లు రాజధానిగా ఆంధ్ర దేశము నేలుచుండెను. మనుమసిద్ధి శత్రువులచే రాజ్యము

గోల్పోయినపుడు తిక్కన గజపతియాస్థానమున కేగి అచటి జైన, శైవ పండితులను వాదమున నోడించి, ఆ సార్వభౌముని మెప్పించి, ఆయన సాయమున మనుమసిద్ధిని మరల రాజ్యప్రతిష్ఠితుని గావించెను.

అప్పటికప్పుడే జైనశైవ ధర్మములు పరస్పరము స్పర్థవహించి దక్షిణాపథమును జీకాకొనర్చుచుండెను. బసవేశ్వరుని వీరశైవ మటు నాస్తికమగు జైనధర్మముపైనే గాక, వైదికమగు వర్ణాశ్రమములపై గూడ కత్తిగట్టి ఆంధ్రకర్ణాటకములను వెల్లువవలె ముంచివైచుచుండెను. వీరశైవధర్మ ప్రతిపాదకములగు దేశికవితలు ద్విపదరూపమున ప్రజల నాలుకలపై నాడుచుండెను. వీరశైవము ధాకకు తాళలేక జైనము ఒకవంక వైదొలగుచుండ మరొకవంక వీరవైష్ణవము దలయెత్త దొడగెను.

ఇట్లు భిన్నధర్మ సంఘర్షణముచే దెసమాలియున్న ఆంధ్రలోక మున సద్వాయమగు వైదికధర్మమును పునః ప్రతిష్ఠింపనెంచి తిక్కన సోమయాజి 'ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయ మును' హరిహరనాథుడను ఇష్టదైవమున కంకితముగా రచించెను.

'తెనుగున సంస్కృతమున జతురుండై తానుభయకవిమిత్రుడు' అని ప్రసిద్ధిగాంచిన తిక్కన భాషాసౌలభ్యమున వీరశైవుల దేశికవి తలకు దీసిపోని జాను తెనుగున 'ఆంధ్రావళి మోదముం బొరయ పద్యములను, గద్యములను' భారతరచనమును గొనసాగించెను.

నన్నయ తిక్కన ఎఱ్ఱనలను నీ మువ్వురును కవిత్రయమని ప్రసిద్ధికెక్కి- ఆంధ్ర కవీశ్వరులకెల్ల ప్రామాణికులైరి. తిక్కన స్వయముగా కృతికర్తయే గాక అనేక కవుల గ్రంథములకు భర్తగూడ నయ్యెనని కేతనకవి తిక్కన కంకితమొనర్చిన తన దశకుమార చరిత్రమున జెప్పెను. మార్కండేయ పురాణము రచించిన మారన తాను తిక్కనకు శిష్యుడనని యుగ్గడించుకొనెను. ఉత్తర హరివంశమును రచించి, సర్వజ్ఞుడని పేర్గన్న నాచన సోమనాథుడుగూడ తిక్కనకు శిష్యప్రాయుడని యూహింపనగును. ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశమున తిక్కనను కవిబ్రహ్మ యని గొండాడెను.

భారతకవులు ముప్పురును మూలగ్రంథమును ఉచితమగు మార్పులతో కథాప్రధానముగా దెనిగించి తరువాతి కవుల కెల్లరకు నా విషయమున మార్గము జూపెట్టిరి. "అగునన గొమ్మయతిక్కడు" జగతిని పూర్వార్థశబ్దచారు కవితమై నెగడిన 'బాణోచ్ఛిష్టం జగత్రయ మ్మనెడి పల్కు సార్థకమయ్యె' అని కేతన చెప్పినట్లు లోకవ్యవహార సిద్ధమగు శబ్దజాల మంతటికి తిక్కన తన కావ్యమున ప్రవేశమిచ్చి దానికపూర్వార్థగౌరవమును కల్పించుటయే కాక తెలుగుమాటలు, వాడుకొన నేర్చినచో సర్వరసములకు, వృత్తులకు బనికివచ్చునని తెల్ల మొనర్చెను. పదబంధమున తిక్కన శిల్పము విలక్షణమై కన్పట్టును. ఇంపారెడు చిన్న చిన్న పల్కుల నాతడు పోదిచేసి దండలు గ్రుచ్చును. అలతియలతితునియలుగా "హాలసంధించినట్లు"పలుకుపొందుచేలపూర్వ రమణీయార్థ కల్పన మొనర్చుటలో నాతడుదిట్ట. మాటలు వాడుకొనుట లోని యాతని పొదుపరితనము మఱియెక్కడచో గానము. ఇక కథాకథన మున నాతడు 'కతరాజే.' పాత్రల ఆకారచేష్టాప్రసంగ స్వభావములను తీర్చిదిద్ది వానికి ప్రాణప్రతిష్ఠ గావించి, కనులయెదుట నిలిపి, నాటక మాడించు నేర్పు తిక్కనకే చెల్లినది. ఆతడు దిద్దిన పాత్రల మాటలు విన్నచో జాలును. వేమందిలోనైన వాని నిట్టె గురితింపవచ్చును.

## కృష్ణరాయబారము

ఎన్నో రాచకార్యములను స్వయముగా నిర్వహించిన తిక్కన మంత్రి ప్రజ్ఞాప్రకర్ష ఆతని ఉద్యోగపర్వమున అద్దమునందువలె ప్రతిఫలించుచుండును. ముఖ్యముగా కృష్ణరాయబార ఘట్టమున తిక్కనామాత్యుని రాజనీతి చతురత్వము మిన్నుముట్టినదని చెప్ప వచ్చును.

'శ్రీగావలెనంచుఁ బోరితముగామియు గోరుచు ఎల్లసొమ్ములుం బోవుటయుం గులక్షయము పుట్టుటయుం వెలిగాగ నొందుమైనేవిధినైన' కార్యముచక్కజేయుమని కోరెడిధర్మరాజు మాటలలో మనకు గాంధీజీ ప్రతిపదమునకు బ్రత్యక్షమగుచు నీతడు 'నిజముగ నహింసావ్రతుడా, రాజనీతిచతురుడా' యని సందియము గూర్చుచుండును. కార్య

వ్రులపై మనమునం దెంత పగయున్నను దాని నడచికొని ధర్మజుని మాట జవదాటలేక భీముడు శాంతినే కోరును. ఆతనికి అన్నయే దైవము. మఱి యర్జునునకో కృష్ణుడే దైవము. కావుననే “హితము ధర్మంబున్ విచారించిచూచి తగుం బొమ్మని, యేది పంచితది నిశ్చింతంబునం జేయుదు” ననును. ‘పౌరుషము, దైవము నను రెండును నీ వినోదములే’ యను నాతడు. ‘వంకమాటలు నేరని’ సహదేవుడు ‘సంధి పెంపారగ నేర్చునే, యుచితమైనది కయ్యము’ అని తెగనాడును. ఇక ద్రౌపదిమాట చెప్పనేల ? ‘ఈ యేవురు సూడగా’ అనుచు భర్తల నొక్క హస్తవిక్షేపముచే బేర్కొని, తనకు వాటిల్లిన దుర్భర పరాభవమును దలపునకు దెచ్చి, ‘ఇవి దుస్ససేను వ్రేళ్లం దవిలి సగము ద్రెవ్విపోయి తక్కినయవి’ యనుచు క్రొమ్ముడి విప్పిచూపుచు ‘కౌరవులకడం దీఱుమాటల యవసరమున వీని దలచుకొ’ మ్మనును.

ఇన్నివిధములైన వీరందరి పల్కులకు దగనాడి ‘కౌరవులకును మీకును హితము ప్రియంబు దగ జేయుదు’ నని పూనియేగెడి కృష్ణుడు రాయబారియా ? కేవల దైవమా ?

## శ్రీకృష్ణపాత్రము

మన ఇతిహాసములు కేవల మానవచరిత్రములు కావు. జనన మరణ పరంపరలలో జిక్కుకొనియున్న మానవుని చరిత్ర మీజన్మలో క్రొత్తగావచ్చినదియు గాదు, దీనితో దీరునదియు గాదు. ఈజన్మమునకు బూర్వాపరములం దింక నెంతయో గాథ యున్నది. పూర్వజన్మము లందలి కర్మఫలమే మనమిపు డనుభవించుచున్నాము. ఆకర్మఫలప్రదాతయే దైవము ; కావున మనచరిత్రములకు వెనుక కర్మస్వరూపముగు దైవ మున్నది. దానిని విప్పిచెప్పుటయే ఇతిహాసముల పని.

ఈ రహస్యము నెఱుగనిచో మానవచరిత్రమంతయు జాలు మూలలు లేక, గుడ్డివానిచేతి రాయివలె నడచుచున్నట్లుండును. జీవితము దుఃఖభాజనమై, అమంగళమై కన్పించును. ధర్మమునకు, సత్యమునకు అపజయమే ఘటిల్లుచున్నట్లుండును. గాంధిజీ యంతటి సత్యమహర్షి కిట్టి చావేలకలుగవలెను ? పోలెండును రక్షించుటకై యున్న

నింతటి మహాయుద్ధము ప్రవర్తిల్లెనుగదా, జర్మను రష్యాలు రెండును ఆదేశము నాక్రమించెనుగదా, అందు జర్మనీ నాశనమగుటయేమి? రష్యా తాను కలుచుకొన్న ముక్కనేగాక పోలెండు నంతటిని తన్ను కొనిపోవుట యేమి? ఆర్త రక్షణార్థై, దుష్ట శిక్షణార్థై, కత్తిగట్టిన అమెరికా బ్రిటనులు పోలెండును రష్యాకు ధారవోసి కనులప్పగించి చూచుచుండుట యేమి? నిజమున కీ పోలెండు చరిత్రము నేటిదా? మఱి యింతటితో నంతమైనదా? మొన్నటి యుద్ధము మంగళాంతమా, అమంగళాంతమా? ఇట్లు యుద్ధములతోనే తెలవారుచున్న ఈ మానవచరిత్రమున కంత మెక్కడ?

ఇట్టి శంకలన్నిటికి సమాధానములు మన ఇతిహాసమునందే కన్పించును. దుర్జ్ఞేయమైన మానవేతిహాసమునకు వెనుకనుండి యాడించు కర్మఫల స్వరూపమగు దైవమును ప్రత్యక్షమొనర్చుటయే వానిపని. మహాభారతేతిహాసమును మనుజరూపమెత్తి నడిపించిన దైవమే కృష్ణుడు. ఈ కురుపాండవచరిత్రమున కృష్ణుడుగూడ పాత్రిధారివలె మనకు గన్పించినను నిజమున కాతడు వారి వారి కర్మల కనురూపఫలము నొసగు దైవముమాత్రమే. దైవమునకు బక్షపాతము లేదు. అతడు గూడ కర్మాధీనుడేగాని స్వతంత్రుడు కాడు. కావున నాతడు సంధియే కూర్చునో, పోరే పొసగించునో మనము చెప్పజాలము. మనల నాడించు కర్మఫలము నెఱుగనట్లే కృష్ణుని గూడ మన మెఱుగము; కావుననే విశ్వరూపసందర్శనము. తద్దర్శనము గూడ మన కర్మాధీనతను మాన్పలేదన్నచో కర్మ యెంత బలవత్తరమో యూహింపుడు. కర్ణజననరహస్యమును కర్ణున కెఱిగించిన కృష్ణుడు పాండవులకే దాని నెఱిగించినచో భారతయుద్ధక్షోభము తప్పెడిదేమో! మన వెఱ్ఱియేగాని అవశ్యంభావియగు దానినెవరు తప్పించగలరు?

మనము సల్పు శుభాశుభకర్మలను వెన్నంటియే యుండి, మనతో మరల మరల బుట్టి పెరుగుచున్న ఈ దైవమును మన మెఱిగియు నెఱుగలేము. దాని నతిక్రమింపవలె నని ఎంతపొరలినను మన పురుష

కారము ఫలసిద్ధి నందదు. "నీవెట్లు నడపదలచి తదియ ప్రియము నాకు" అనియు, "నీ వొనరింప బూనిన పనికి గమలోదర కీడు పుట్టునే" అనియు నమ్రఁ జేర్చినచో "డెందానం జెయి వెట్టికొని యతడు నిద్రించును."

అతివిచిత్రమైన దీ జగన్నాటకము! దీనికి సూత్రధారియయ్యు నిందు పాత్రధారణము గూడ సల్పిన శ్రీకృష్ణపాత్రను నడిపించిన చందము తిక్కన కవి బ్రహ్మకే తగును. జగత్తునకు గారణము, కార్యము దానయై, అంతమును దానేయైన మంగళస్వరూప మగు దైవమును దర్శించి దానిని భూమిపై నవతరింపజేయుటకు భారత మహా ఋషులే వలంతులు. ఆంధ్రమహాభారతమున శ్రీకృష్ణునియందు ఆ దైవ మును దర్శించి, "అవ్విభుం గట్టెద పట్టి మప్రతిమ కారుణికత్వ మహా విభూతికిన్" అన్న ప్రతిజ్ఞను తిక్కన్న చెల్లించుకొన్నాడు.

కాటూరి వేంకటేశ్వరరావు.

---

# శ్రీమదాంధ్రమహాభారతము

## శ్రీకృష్ణనిర్యాణభారము

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె. 1

తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన ధర్మ
సుతుఁడు మఱునాఁడు దమ్ముల సుతుల నిష్ట
భృత్యవరులను దొరలను బిలువఁ బనిచి
యెల్లవారును విను చుండ నిట్టు లనియె. 2

క. మనము జనార్దనుపాలికిఁ
జని కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు, బంధుహితగురు
జనములతో రణము గాక సంప్రీతి యగున్. 3

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున
కరిగి యతనిచేత సత్కృతుం డయి సమస్తపరిజనంబులుం బరివే
ష్టింప నొక్కపార్శ్వంబునం బాంచాలియు సముచితపరివారపరివృత
యై యుండ నతండునుం దానును సుఖాసీనుం డై యుండి యత
నితో ని ట్లనియె. 4

క. ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. 5

తే. సమయ మిది మిత్త్రకార్యంబు చక్కఁజేయ
నీకతంబున నే మవినీతుఁ డైన

యాసుయోధనుతోడి పోరాట దక్కి
యనుభవింతుము మాయంశ మనఘచరిత్ర. 6

వ. నీకు నేము ప్రద్యుమ్నాదికుమారులతోడివారము, మమ్ము దురితంబులు వొరయకుండ నరసి రక్షింపు మనవుడు వాసుదేవుండు నీపంచినయట్ల చేయం గలవాఁడ నెయ్యది తలంపు సెప్పు మనిన నజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి కౌరవులతోడం దగిన మాటలాడి తెఱంగు సేయ వలయు నని ప్రార్థించి యతని నియ్యకొలిపి యిట్లనియె. 7

సీ. మాతండ్రి తలఁపును నాతని నందను
చందంబు నిన్న యాసంజయుండు
పలికినపలుకులఁ దెలిసెఁగదా నీకు
వారిచిత్తము భంగి వాని తెఱంగుఁ
బాలుపం బని యీక యేలిమాటలన మ
మ్మలుక దీర్చెదరు తా రధికదుష్క-
రం బైనయాసమయం బేము పదుమూఁడు
వత్సరంబులు సల్పి వచ్చి యుండఁ

ఆ. గులముపాడి నడకఁ దలఁపఁడు పతి సెకఁ
దలఁచె నేనిఁ గొడుకు వలచినట్టి
వాఁడు గాన యతనివక్రత మాన్ప లేఁ
డింతకంటెఁ గలదె యొకరు మాకు. 8

క. జననియు సమస్తబాంధవ
జనములుఁ బ్రియమంద వారి శాంతులఁగాఁ జే
యను నెమ్మిగ నొక్కటియై
మనము దెలఁ గేది యునికి మాపౌరుషమే. 9

క. ఇచ్చుటబంధులు నీవును
నచ్చెరువడి వినుచు నుండ నయిదూళ్లను మా
కిచ్చినను జాలు నంటిని
బొచ్చెము గా దింతవట్టు పూర్ణము సుమ్మీ. 10

శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రియును జేయం జాలఁడో కాని పెం
పేదం గ్షాత్రత కోర్వ రాదు, సిరి నా కే లందునే, గ్రాసవా
సోదైన్యంబులు వచ్చు సోదరయుతీచుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గుఁ గౌరవులు నేముం బొంది శ్రీ నొందినన్. 11

ఉ. అక్కట లాఁతులైన, పగ తైనను, జంపన కోర నేల యొం
డొక్క తెఱంగు లేదె, యది యొప్పదె, బంధుసుహృజ్జనంబు లా
దిక్కున నున్నవారు, గణుతింపక సంపద కై వధించి మా
తెక్కట దోష మందు టనునీయరవస్థల కోర్వ వచ్చునే. 12

వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 13

ఆ. క్షత్త్రధర్మ మింత కష్ట మగునె, పెఱ
ధర్మ మాచరింపఁ దగ దటంచు
గాన శస్త్రజీవికయు తగి యున్నది
యైన వంశనాశ మనభినుతము. 14

వ. అదియునుం గాక. 15

ఆ. కలహ మగుట లక్ష్మిఁ గావింపుఁ బ్రాణహా
నియును జేయు నింత నిక్కవంబు
పలువు రొకని గోడి పాఱుట, బల్లిదు
లనదచేతఁ జెడుటయును ఘటించు. 16

క. జయ మగునోడుదు మనుని
శ్చయ మొక్కఁడు లేదు, వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ
దయపుటభేదనము సేయుఁ దథ్యం బనఘా.

క. కాన యవశ్యము జెనకువ 17
గానియుపాయమునఁ బగఱఁ గడ కేర్పుధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం
దానం జెయి వెట్టుకొని యతఁడు నిద్రించున్. 18

ఆ. పగయ కలిగనేని బాముున్న యింటిలో
నున్నయట్లకాక యూఱడిల్లి

యుండునట్లు చిత్త మొకమాటుఁ, గావున
వలవ దధిక దీర్ఘవైరవృత్తి. 19

చ. పగ యడఁగించు టెంతయు శుభం, బది లెస్స యడంగునే పగం,
బగ వగ గొన్న మాన్పొనక పల్కక యుండఁగ వచ్చునే, కడుం
దెగ మొద లెత్తి పోవ, బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్యమొందు, నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా. 20

ఉ. కావున శాంతిఁ బొందుటయ కర్జము, దా నది యట్టు లుండె, శ్రీ
గావలె నంచుఁ బోరితము గామియుఁ గోరెద, మెల్ల సొమ్ములుం
బోవుటయుం, గులక్షయము పుట్టుటయున్, వెలిగాఁగ నొందుమై
నవిధి నైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా. 21

చ. మనమునఁ బక్షపాతగతి మాడెప మానుము, ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హితంబును బెంపును గల్గు నట్టిచొ
ప్పున, విదురాది సజ్జనుల బుద్ధికి రా నుచితంబుతోడి మె
ల్పునఁ బరుసందనంబునను భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ. 22

చ. తగవునఁ బోక, రాజు బెడిదంబులు వల్కినయేని సైఁచి, రొం
ప్పుగ నిలుమీ, గురుత్వముఁ బ్రభుత్వమునుం గల పెద్దవారిమా
ట గొనమి, యా సుయోధనుకడన్ నిలువన్, మన మెల్ల, గారవం
బుగఁ గురువృద్ధుపల్కుఁదలఁపుంజన నిచ్చిన, మెచ్చరే జనుల్. 23

మ. సుతువాఁడై వినయంబు సేకొనక, యేచొప్పుం దగం జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగ రా దంచు వే
గ తెగం బాఱకు, తెంపు సేయునెడ లోకం బెల్ల మెచ్చం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చింతంబు గాఁ జేయుమీ. 24

ఆ. ఇన్ని సంకటముల నిబ్భంగి నెంతయు
నోగులుచిత్తవృత్తి నొవ్వ దీర్ప
వెజ్జ వీవ కావె వేయేల యేగతి
నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము. 25

వ. అని చెప్పి తలంచికొని వెండియు ని ట్లనియె. 26

క. నీవు సుయోధనుపాలికిఁ
బోవఁగ వల దనియు నొక్కబుద్ధి వొడమెడున్
గోవింద యతఁడు మంత్రులఁ
గావరమునఁ జక్క వినరు కార్యవచనముల్. 27

తే. కుటిలమతు లవినీతులు క్రూరకర్మ
లట్టినీచులకడకు నిన్ననుపఁ జాల
నీవు సంకట పడియెదు దేవపదవి
యైన నే నొల్ల, నొంటి యం దరుగు టుడుగు. 28

చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్లనియె నా ధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త
త్తనయుఁడ యేల, నీపలుకు తథ్యము నీతలఁ పే నెఱింగితి
న్మనమున శంక దక్కుము వినన్ వలతే, విను మేను నిక్క మ
ల్గిన నచటంగలండె రణకేళికి మార్కొన నొక్కఁ డేనియున్. 29

క. పనుపుము కౌరవసభ కేఁ
జను టెట్టును మేల, యర్థసంసిద్ధి యగున్
మన కొకటం బాపము రా
కునికికిఁ గత మైనపలుకు లొండెను గలుగున్. 30

వ. అని పలికిన యుధిష్ఠిరుం డిట్లనియె. 31

ఆ. మేలు గాక నీకుఁ బోలిన ట్లయిన నం
దరిగి యేము వారు నర్థిఁ బొంది
యుండునట్లు గాఁగ నొడఁబాటు గావింపు
మెల్లభంగి మనకు నిదియ లెస్స. 32

క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు
పొ మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. 33

కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవుల దుర్ణయంబు సెప్పుట.

సీ. అనిన ముకుందుఁ డి ట్లనియె సంజయుని మా
టలును నీ వన్న పల్కులును వింటి

సీమది ధర్మైకనిష్ఠమై యున్నది
వైరంబు విడువరు వాడు ద్రోణ
భీష్ములు గల రని బిరుసు లై యున్నవా
రగునె రాజన్యుల కడఁగి కనుడు
నక్లేశవృత్తి రాజ్యము చవి గొన్నవా
రేల యిత్తురు నీకుఁ బాలు సెపుము
తే. ధార్తరాష్ట్రులు సరికి నధర్మమునకు
నలుక రెన్నఁడు విడువు దైన్యంబు పొడువు
కయ్య మరివర్గిజయమునఁ గలుగు నిహప
రములుఁ జిరకీర్తియును బాండురాజతనయ. 34
మ. గురుభీష్మాదులు సూచు చుండ సభ మీకుం గీడు నాఁ డట్లు ము
ష్కరు లై చేసిరి, యంత నేసియును బశ్చాత్తాపముం బొంద రో
పర వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయుక్తా బంధుత్వముం దక్క మె
వ్వరుఁ గోపింపరె యీదురాత్మకులఁ గర్వాకార్యముల్ సూచినన్. 35
వ. కపటపునెత్తంబు నెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యో
ధన దుశ్శాసన శకుని సూతనందనులు పుయిలోట దక్క కలకల
నవ్వుచుం బలికినపలుకు లుగ్గడింపవచ్చునే వాని విని సమస్తజనం
బులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతుల రయి యుం
డియు సత్యంబు పాటించి యూరక పోక సూచి యచ్చెరుపాటుతో
నుమ్మలించు చుండిరి తిట్టువాట్లం బొరయుడువారు దైవోపహతులై
యున్న చెడియుండుదురు గావున వారలం జెఱపనుం జులుకన,
క్రూరాత్ములగు కౌరవు లెల్లవారికి వధ్యులు గాఁ దగుదురు నీ కేల
యవధ్యు లైరి. పాపాత్మకులగు హింసకులం బాముల నెట్లట్ల
నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు. 36
క. మీతండ్రికి భీష్మునకుం
జేతోముద మొదవ భక్తి సేయుచు తగ నీ
కాతలకు నేనుఁ జని వి
ఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్. 37

క. చెలులుం జుట్టలు దేశం
బుల రాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం
బులు నీవు ధర్మమార్గము
దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్. 38

వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెలుఁగు మాలిన మాట లాడుటయుఁ దండ్రి యతని వారింపనేరమికిఁ దో డుపేక్షకుం డగుటయుఁ జూచి మీ తొల్లిఁటిపాట్లనుఁ దలంచి యెల్లవారును వారిన గర్వింతు రింతియ కాక మనకు నొండేమి వలయు. నా యోపినంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపం జూచెద. నవ్విధంబు సిద్ధించిన మేలు గాదె, యట్లు గాక తక్కిన నచ్చోటి యుత్సాహంబుచందంబును నందుఁ జేయం గలవారివ ర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయం బగువిధంబునం జనుదెంచెద. 39

తే. ఆసుయోధనుముక్కున నావి గలుగఁ
బుడమి నీ కీఁడు, గావునఁ బోరఁ గలుగు
నేను గయ్యపుశకునంబు లెన్నియేనిఁ
గంటి నీ వనుత్సాహివి గాఁగ వలదు. 40

వ. చతురంగబలంబుల నాయితంబు గావించుచు వారలం బురికొల్పి కొనుచు నాలస్యంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండ వలయు నని పలికిన విని వృకోదరుండు దామోదరున కిట్లనియె. 41

క. సమరంబు గలుగు ననుచును
మము వెఱపింపంగ వలదు మాధవ నీ వా
కుమతి యగుధార్తరాష్ట్రుఁడు
శమించుకార్యంబు నడపు సౌజన్యమునన్. 42

వ. అని వెండియు. 43

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతుబుఁవ నీపం బెట్లునుఁ జేయఁగా
నోపం డడ్డము సెప్ప రెవ్వరును మానోద్రేకమున్ గర్వముం
గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం గుందించుటం బోయిన
ట్లె పోనిత్తురు గాన ని న్నతఁడు జాలిం బెట్టెడుం జూడుమీ. 44

ఉ. చొచ్చినచోన చొచ్చి తెగఁజూచెద నంచుఁ గడంగు చుండు న
న్నెచ్చఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ బోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురువంశము చేటున కోపకుండుటన్. 45

ఉ. పాండవకౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మిమై
నుండగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె నాతఁ డొ
క్కండ కులక్షయంబునకుఁ గారణమం డ్రది దప్పదైన నీ
వొం డన నేల యాబిరుదు నోపినయంతయుఁ దీర్ప నేర్పునన్. 46

చ. తనపొలివోవునంతకు నుదగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు యశోభరితం బగుభారతాన్వయం
బున కొకనింద వచ్చు ననుబుద్ధి మహాత్మున కేల కల్గు నా
యన మెయిఁ బోయి హీనగతి నైన ఘటించిన నెంత యొప్పునో. 47

వ. మాకును వారికిఁ బితామహుం డగుభీష్ముండు విను చుండ సుయోధనుతోడం గురుకులేశ్వరునాస్థానంబున నావచనంబులుగా నిట్లనుము. 48

తే. అన్నదమ్ములమై యుండి యకట మనల
నొరులు దలమొత్తి చూడ నొండొరులతోడఁ
బెనఁగ నేటికి నీ వేల పెద్దవారి
బుద్ధి విని పంచి కుడుచుట పోలదొక్కొ. 49

క. అని యెవ్విధమున నైనను
వనజోదర సంధి సేయ వలయుం దగ నే
మును వారును గలయుట భూ
జనులకు నెల్లను హితంబు సౌఖ్యకరంబున్. 50

చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి యంబుజనాభుఁడు వల్కె నెన్నఁడున్
వినని వి భీముపాలఁ గడు వింతలు వింటిమి మాట, లగ్గి చ
ల్లనగుట భూరిభూధరము లాఘవ మొందుట గాదె యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ బొందుట యింకిటఁ జెప్ప నేటికిన్. 51

శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడియుద్ధమునకుఁ బురికొల్పుట.

తే. అని సహోదరు లాజి నాయాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁ జంప నొల్లమియును
గలుగు నెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ
డైన పవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి. 52

వ. మురమర్దనుం డతనితో ని ట్లనియె. 53

ఉ. యుద్ధమునీఁది వేడ్కయు, మహోగ్రవిరోధులనల్కఁ జేయుద
ర్పోద్ధతియున్, సుయోధనునియున్నతి సైపనియేపు, రాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ జేయుతలంపును గల్గునీ వసం
బద్ధము లైనవాక్యములు పల్కుట యొప్పునె, కీచకాంతకా. 54

వ. అని యంత నిలువక. 55

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు
నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకోయీ
పిఱికితన మింత యలవడఁ
గఱపినవా రనుచు శౌరి గలకల నవ్వెన్. 56

వ. దానికి దరహసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున
కి ట్లనియె. 57

ఉ. బంటుతనంబు మాటలకుఁ బాఱకు, పాండునృపాలుపాలు గై
కొంటయ చాలు నన్న నృపకుంజరుపల్కుల కడ్డ మాడ రా
కుంట యెఱుంగవే ముకు, సుయోధనుచందము జూపి యప్పు డే
మంటి యుపేంద్ర నన్నని రణాగ్రమునన్ నినుమాఁదలించెదన్. 58

క. నాకొలఁది విచారింపక,
నీ కిట్లనఁ దగునె మిన్ను నేలయు నిమ్మైఁ
గాక తిరుగంగఁ బడినం
బోకే ముంజేతు లొడ్డి పోవఁగ ద్రోతున్. 59

ఉ. నావుడు నప్పటాల కనినం బవనాత్మజ యింత యేటికిం
గేవల యోధవే, పరులకిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్

జావక మైనఁ జూచి, యిది చందము గా దని యంటిఁ గాక నీ
చేవయు లావు నీవు మును చేసినభంగులు నే నెఱుంగనే. 60

వ. అని చెప్పి మాధవుండు మఱియును. 61

ఉ. పార్థుఁడు పోరఁ దేరు గడపం దనకున్ ననుఁ గోరి యెంతయుం
బ్రార్థన సేసె, దాని కనురాగము వొందితి నేను, గాన యు
ద్ధార్థుల మైన మాకు నిను నాసపడం దగదే, యశంబు నా
నార్థములున్ విరోధి విజయంబునఁ దక్కఁగఁ నొంటఁ గల్గునే. 62

వ. అనవుడు. 63

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగ లై యీవచ్చు కౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం, బెద్దమి ద్రెక్కి మి
మ్మెల్ల న్వెఱగంది చూచెదము గా కీసారెకుం బోయి రా
భీముం డిట్టి రిత్తమాటలకుఁ గోపింపండు సూ, పెం పఱన్. 64

వ. అని పలికి యవ్విధంబున గోపాలదేవు మేలంపుమెయివడి కార్య
వచనంబులకుం దగం దానును దోడ్తో సరసం బాడుటయు కా
మఱుమాట లాడి యంతటఁ దని పోవక బకమర్దనుం డతనితో
ని ట్లనియె. 65

ఉ. కయ్యము గల్గిన ట్లయిన గంధగజప్రకరంబుకుంభముల్
వ్రయ్యఁ దురంగపంక్తులు ధరంబడఁ దేరిగముల్ బడల్పడన్
డయ్యమి కీవు వెక్కసపడన్ గదపండువు సేయఁ గోరునా
దయ్యమునె త్తికోలు దుది దాఁకుట గాదె భుజంగభంజనా. 66

చ. అన విని దేవకీతనయుఁ డాతని కి ట్లనుఁ జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు, గడిందిమగండవు, నిన్నుఁ జెప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకున్ భయ మొందక దుఃఖవార్ధు లీఁ
దినము నెల్ల నిక్కటత దీర్చి సుఖాత్ముల జేయు పావనీ. 67

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ
బదనికి రాఁ బలికి సంధి వాటించెద నా
కది యొప్పదె కాని తుదిం
గుదు రింతకు నీవ కావె గుణరత్ననిధీ! 68

అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దన యభిప్రాయంబు సెప్పుట.

వ. అనిన వాసుదేవున కర్జునుం డి ట్లనియె, 69

తే. చెప్పఁ గలయంతవట్టును జెప్పె నీ క
జాతశత్రుం డది వింటి వీ వాతెఱంగు
మాకు నెల్లను బలుకంగ మాట లొండు
గలవె యైనను జెప్పెదఁ గన్నయంత. 70

మ. ధృతరాష్ట్రుం డతిలోభమోహితుఁడు ధాత్రీభాగ మీఁ నేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగు నంచున్ మున్న కైపెక్కిన
ట్టితలం పచ్యుత నీకు గల్గినది గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జంతం బాప రాదో కదే. 71

ఉ. నీ వొనరింపఁ బూనినపనిం గమలోదర కీడు పుట్టునే
కా వనినట్ల యుండి యవుఁ గార్యము ల ట్లగుటం బ్రియత్నసం
భావన నేత పౌరుషముపద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో
దైవము దోడ్పడన్ వలయుఁ దథ్యము రెండును నీవినోదముల్. 72

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యు లన్న నె
వ్వారికిఁ బోలదే సుజనవత్సల నీ విటు లంట వారు మ
మ్మీరస మొత్తి కీడ్పఱచి యింతలు సేసినదాన నీమదిం
గూరిననొవ్వుసొంపునను గోపము పెంపునఁ గాదె యూరయున్. 73

ఉ. వినను జిత్తగింపు దుపదాత్మజ నాసభ నట్లు సేసినన్
దానికి సైఁప లెస్స యని దైన్యముఁ బొందుట కోర్చి యమ్మెయిం
గాననభూమికిం జనుట కారుణికోత్తమ నీ వెఱుంగవే
కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్పు నేర్పునన్. 74

తే. అలవియెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి
మమ్ము బఱిచినపాటులు మానసమునఁ
జవుటఁ బెట్టినవిత్తులచంద మొంది
యంకురింపక చెడిపోయె నంబుజాక్ష. 75

వ. అమ్మెఱకుల నెమ్మెయి నయినను, 76

క. ఒడబఱిచి మాకు వారికిఁ,
బొడమిసగము గాఁగఁ జేసి పొంది వొసఁగి యుం
డెడు నట్టి తెఱఁగు సేయుట,
కడు మేలది గౌరవము సుఖంబును జేయున్. 77

క. నీ కిట్టిది చిత్తమునకు,
రాకుండిన నేని వలదు రం జిమ్మోయి మీ
రీకార్యము సేయుం డని
మా కానతి యిమ్ము కంసమర్దన తెలియన్. 78

మ. హిత మిబ్బం గిది మాకు ధర్మము తెఱం గిట్లుండు నం చేను నీ
మతి బోధింప వలంతినే హితము ధర్మంబున్ విచారించి చూ
చి తగం బొమ్మని యేది పంచి తది నిశ్చింతంబునం జేసి యు
న్నతిఁ బొందం గలవార మై యునికి గృష్ణా నేఁడుగా వచ్చెనే. 79

వ. అనిన విని కృష్ణుండు విజయున కి ట్లనియె. 80

చ. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మే లొనర్చినం
దొరకొనునే ఫలంబు దఱితోఁ దగువర్షము లేకయున్న నె
ప్పురుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలియించు నెల్ల నా
దరణమునం బ్రసన్న మగుదైవముచేఁతన చూవె ఫల్గునా. 81

ఉ. కావున సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయున్
దైవముచేఁత యె ట్లగునొ దాని నెఱుంగ, సుయోధనుండు సం
భావన సేసి పా లొసఁగు పాడియ కల్గిన బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే. 82

వ. అది యెల్ల న ట్లుండె నిచ్చట విరాటుపసులన్ బెట్టింప నీవు
వోయినయప్పుడు భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు. 83

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు నెల్ల విధంబుల గొర్చు, టట్లు గా
కిచ్చ దలంచి యొక్కమొయి నిత్తఱిఁ బొం దగుచేఁతయుం దగున్. 84

వ. అనియె దాని కతం డుత్తరం బిచ్చిన తెఱంగు. 85

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు
నెట్లు వొందు గలుగు, నేను రాజ్య
భాగ మీను, సమరభంగిక విక్రమ
నిరతిఁ జూను టిదియ నిశ్చయంబు. 86

వ. అని పలికె నది యంతయుఁ బదంపడి మన మెల్ల వింటిమ కాదెఁ యామాటల ఫలం బప్పుడ కనియు నాకట్టాత్ముండు వెండియు, దెలియండు. 87

తే. అతనిగుణదోషముల చంద మట్ల యుండె
నాకు ధర్మజుబుద్ధిన నడప వలయు
నిత్తెఱం గాచరింపంగ నేఁగి యచట
నెల్ల తెఱఁగును నేర్పడ నెఱిఁగి వత్తు. 88

చ. అనిన ముకుందుతో నకులుఁ డల్లన యి ట్లను నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁడుం దగఁ జెప్పుట రిత్త గాదు మా
మనము లరణ్యవాసమున మత్స్యమహీపతిపాల నున్న య
ద్దినములభంగి గాదు కృపఁ దీవ్రతఁ గుందినచంద మయ్యెడున్. 89

క. కడవఁగ నోకళ్ళు పసరము
నడిచిన నొక్కఁతులుఁ బెయ్యి నడువ వలయునే
చెడు తెరు వాకౌరవ్యుల
కడ నిలుచుం గాక మనకుఁ గార్యం బేలా. 90

సీ. గోగ్రహణంబునఁ గోలె నెంతయు మెత్తఁ
బడ కుండుదురె వారు పద్మనాభ
నీయనుగ్రహమున నెమ్మిమైఁ గూడిన
బలము లే దక్షౌహిణులును దొరలుఁ
బాంచాలయాదవపాండ్య కైకయమా
త్స్యుల తెంపు లెఱుఁగక యున్నవారె
భీమార్జునులలావు పెంపును నీసహా
యంబును గలుగుట కలుక రెట్లు

ఆ. గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి
సెప్పి వారిఁ జక్కఁ జేయరెట్లు
కార్య మీవు సెప్పఁగా విదురుండు వి
నంగ నెట్లు గా దనంగ వచ్చు. 91

వ. అట్లుం గాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రు లాదరింప కుండ వెఱవరే నీపోయినప్పుడ యీకార్యంబు చక్క నగు ననిన విని సహదేవుండు వాసుదేవున కిట్లనియె. 92

ఉ. రక్కసమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటి యైనఁ గాదనక యూఁకొను చుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేఁడికొననైనను బోయెదు వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా. 93

మ. తలఁపం గూడునె యింత లేసిదొరలీ దైన్యంబు, చుట్టంబులుం
జెలులుం దిట్టరె, లాఁతిరాజులకు మెచ్చే యివ్విధం; బిట్టిదిం
గలదే, వేఁడఁగ ధర్మజుం, డడుగఁ బోఁగాఁ గృష్ణుఁ డాధార్తరా
ష్ట్రులు పాలీక చలంబునం బెనఁగ, నిట్లుం గూడు దీ పయ్యనే. 94

ఉ. వీరలు ధర్మమార్గము నవిస్తరతం దగ నాడిరేనియు,
న్వారలు దాని కియ్యకొనినన్, విను మచ్యుత యట్టిసంధి పెం
పారఁగ నేర్చునే, యుచిత మైనది కయ్యము, వంకమాట లే
నేరఁ, గురుప్రవీరసభ నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ. 95

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరు వంచించియుం
బదమూఁడేఁడులు నీవునుం దిరిగి రాఁ బాలీక పో వచ్చునే
యది గాదే, దెగి బంటవై యఱుము, మాయల్ వన్ను నేర్పింకఁ జె
ల్లను సూ నీ కని యాసుయోధనుని యుల్లంబుచ్చి పో నాడుమీ. 96

మ. అనినన్ సాత్యకి ప్రీతుఁడై యితఁడు లెస్సె యుండఁ బల్కెం, బ్రయో
జనముం గల్గదు, గౌరవంబుఁ జెడు, దుశ్చారిత్రకుం డా సుయో
ధను బోధింపఁగఁ బోయినన్ సరభసోత్సాహంబుమై నున్న వీ
రనికాయంబున కెల్లనుం బ్రియము సంగ్రామంబు మేలెమ్మెయిన్. 97

వ. అనిన విని రథికవరు లందఱు సహదేవుం డింత యొప్పు నాడునే,
సాత్యకి పలుకు లిట్లుండునే, తక్కటివి యొక్కటిమాటలు, పగవారి
నడిగికొనం బోవుట యుచితంబు గాదఁట, కయ్యంబు కర్జంబు గా దఁట,
భంగంబు సేఁగికొనం దగ దఁట యనునివి మొదలుగా ననేకు లనేక
ప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్కమ్రోఁతఁగా
జెలంగిన యెలుంగులు నింగి ముట్టెఁ దదనంతరంబ. 98

ద్రౌపదిఁ గృష్ణునితోఁ దన మున్ను పడిన భంగపాట్లు సెప్పుట.

తే. ధర్మనందను పలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు. 99

ఉ. అంతలు సేసి పో నడచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె, యిట్టి యూఱట మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు, దా
నంతన యూళ్లు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ, యీ
కంతకృపావిహీనమతి, నాతఁడు నొంచునె యన్నదమ్ములన్. 100

చ. తనమునుపడ్డ బన్నములుఁ దమ్ములపైఁ గల కూర్మి పేర్మి నీ
జనపతి సైఁప కున్నె, యని సక్కన, రాజ్యముపాలు లేక తీ
యుప గొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె, చాలరైరి వీ
రనరొకొ, నాన లేమి యని యాడరె, లోకమువారు కేశవా. 101

శా. వెం పేదం దమ కిట్టి తక్కువలు రూపింపంగ నేలా, విచా
రింపన్ వారిక మేలు సంధి దము వారిం జూచినం, దారు సా
ధింపం జాలరొ కాక పోరఁ దగ మర్దింపం బలంబేని శం
కింపం బట్టొకొ, వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్. 102

ఉ. ఓట యొకింత యేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే, దురభిమానము యెక్కుఁడు పూనుఁ గాక య
చ్చోటన సంగరంబు లగు చొప్పులు పుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ పోదురొ కానల నుండ నచ్యుతా. 103

ఉ. ఏ నిటు లంటి నానలవ ; దింకను నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబు సూచి మనకార్యము మీ సుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక, తగం గురువర్గముతోడి సంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్. 104

వ. అని మఱియు ని ట్లనియె. 105

ఉ. ఆఁడిబోకయున్, ఫలము నందుటయుం గని పల్క నేరమిన్
మాఱటనోరిదాన నయి, మాటలు చిత్తమునందు నిల్పకేఁ
గాఱులు ప్రేలెదన్ వినుఁడు కర్జము నెగ్గును గాన నల్కమై
వీఱిఁడి యైనమానిసికి వెంకి వివేకము గల్గ నేర్చునే. 106

చ. వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండుభూ
వరునకుఁ గోడ లైతి జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరు లగుపుత్త్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ, యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్. 107

వ. అట్లుంగాక. 108

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టినఁ బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెను పొందినవేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ, గులాంగన ని ట్లొనర్తురే. 109

ఉ. ఆసభ కేకవస్త్ర యగు నట్టి ననుం గొని వచ్చి నొంచుదు
శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రము లై, తగు చేష్ట లేక, నా
యాసలు మాని, చిత్రముల యాకృతి నున్న యెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం ; బదియుం దలంపవే 110

చ. అరయమిఁ జేసి కోడ లన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు పోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో, యటు గాక పాడియై
వరవుడ మోపి చేయుదునొ వారికి, మాధవ నిశ్చయింపుమా. 111

వ. అని యు ట్లుగ్గడించి. 112

ఉ. ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మఱ విచ్చి వెండ్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గనలేచి యార్తయై. 113

వ. గోవిందుముందటం బెట్టి యి ట్లనియె. 114

క. ఇవి దుస్ససేనువ్రేళ్ళం,
దవిలి, సగము ద్రెవ్వి పోయి దక్కినయవి, కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వీనిన్. 115

సీ. ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యా చేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరి రూ
పఱియున్నఁ గని యుసు కాఱుఁగాక
యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చె యిది
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి, గాండీవ
మను నొకవి ల్లెప్పుడును వహించు

ఆ. కత్తి విక్రమంబుఁ గాల్పనే, యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁ బడయనైతి మేనిఁ గృష్ణ. 116

ఉ. నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలము, దీనికి నాఱు నెన్నఁడుం
బుట్టదు, దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁ బొల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా. 117

శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట.

వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు

రూప కావునఁ గోరి యేరూపునందు
నుభయపక్షంబులకుఁ జేయు ముచితహితము 125

క. ధర్మార్థసంగతంబుగ
ధర్మతనయు చెప్పినట్లు తగఁ బల్కఁగ నా
దుర్మతులు కౌరవులు స
త్కర్మమునకుఁ జొరకయున్న దైవమ యెఱుఁగున్. 126

క. అన విని కౌరవులకు మీ
కును హితముఁ బ్రియంబుఁ జేయఁ గోరియ కుంతీ
తనయాగ్రజుపని ధృతరా
ష్ట్రునికడకుం బోయెదను గడుం బ్రీతిమెయిన్. 127

క. అని పలికిన హరి ధర్మవ
చనముల తెఱఁగున కజాతశత్రుఁడు చిత్తం
బునఁ బొంగి యట్ల చేయుము
మన నిశ్చయ మిదియ దీని మఱవకు మనఘా. 128

వ. అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి నారాయణుంజూచి నీ నక్షత్రంబు రోహిణిగదా యెల్లి రేవతి నీకుఁ జంద్రతారాబలంబులు గలవు గమనంబునకు రేపకడయ మేలు పయనం బగుట లెస్సయని చెప్పిన నప్పలుకుల కతంబు సగౌరవంబుగా నియ్యకొనిన బాండవాగ్రజుండు గొలువుం గలయం గనుంగొని యెల్లవారును విన నది యట్లకాక యని పలికి తదనంతరంబ తానునుం దమ్ములుఁ బాంచాలియుఁ బరివారంబును నుచితప్రకారంబున నిజనివాసంబులకుం జనిరి మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు గాలోచితకృత్యంబులు నిర్వర్తించి సూర్యోపాస్తి సేసి యగ్నిసమారాధనం బాచరించి ధరణీసురులం బ్రణామపూర్వకంబుగాఁ బ్రయాణదాన ప్రముఖపూజావిశేషంబులం బ్రీతులంగావించి వారల యిచ్చు నాశీర్వాదంబులును సమంత్రాక్షతదూర్వాంకురాదులునుం గైకొని యుచితప్రదేశంబున నుండి సాత్యకి రావించి. 129

క. మన వ్రేపలోఁ గరిపురికిం
జనుదేరఁగ వలయు వారి సవరణతో రం
డని యేర్పడ నియమింపు మ
యనఘా యేతెమ్ము సేన్య మని తగ మఱియున్. 130

వ. దుర్యోధనుండు దుష్టాత్మకుం డతండు మన్నించు మానిసులునుం గుటిలబుద్ధులు గావునఁ జక్రగదాద్యాయుధంబులు రథంబునం బెట్టింప వలయునని చెప్పి పనిచి సమయజ్ఞతం బొడసూపి నిలుచున్న దారుకుం జూచి తేరు పూన్ప నియోగించిన నతండును మణిగణప్రభాపటలజటిలం బగు నరదంబు వన్నె శైలసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లనం బరఁగు తురంగంబులం బూన్చి గరుడధ్వజం బెత్తి తెచ్చినం దానునుం బయనంపుఁ జందంబునఁ గట్టాయితంబై జనంబుల చూడ్కులకుం బండు వగుచుఁ బుండరీకాక్షుండు మంగళతూర్యంబులు సెలంగఁ జామరంబు లుల్లసిల్ల రథం బెక్కిన యవసరంబున యాదవపరివారంబుతో నరుగుదెంచిన సాత్యకిం దన రథం బెక్కించుకొని యాంగికంబులైన శుభసూచకంబులు గైకొనుచుఁ బూర్ణకలశవృషభాదిభద్రపదార్థంబుల నవలోకించుచుఁ బుణ్యాంగనలు సేస లొలుకఁ జిత్తంబు ప్రసన్నతం బొంద వెడలునప్పుడు. 131

సీ. పాండవ యాదవ పాంచాల కేకయ
పాండ్య మాత్స్యాదులు భద్రదంతి
హయ రథంబులతోడ నతికుతూహలమున
వచ్చినఁ గనుఁగొని వారినెల్ల
సంభావనంబుల సంభాషణంబుల
నాదరించుచుఁ దగ నల్లనల్ల
విభవంబు మెఱయంగ, విడిదలపఱి వెల్లఁ
గడచిన యుత్తఱిఁ గరము శుభము

ఆ. లైనశకునములకు నందఱుఁ బ్రియ మంద
నరుగు చున్న యట్టియవసరమున

రథము రథముఁ గదియ రానిచ్చి ధర్మనం
దనుఁడు నెమ్మి నిట్టు లనియె హరికి. 132

ఉ. వచ్చె జనార్దనుం డనినవార్తకుఁ బ్రాణము మేని కంతకున్
వచ్చిన, నేడ దేఱుఁ గురువంశపవిత్రచరిత్ర గొంతి, నీ
వచ్చుట కేఁగి పాండవుల యందఱిమాట అని చెప్పి మ్రొక్కుచున్
గ్రుచ్చియ కౌఁగిలించుకొని కుందినచిత్తమునొప్పి దీర్చుమీ. 133

చ. అడవికి నేఁగునాఁడు మము నంపఁగ నెంతయు దవ్వు వచ్చిన
ప్పుడు దనమోహము దైన్యమునఁ బొందెమునశ్రులుఁ జూచి చూచి యు
ట్లొడఁబడి డించి పోవలసె నుమ్మలికమ్మున గొంతి యింతకున్
బడుగయి పాలలోఁ బడినబల్లివిధంబున నుండ కుండునే. 134

క. లక్కయిలు గాలినది మొద
లక్కట మాతల్లి మాకు నై నెవ్వగతోఁ
బెక్కిడుమలఁ బడు చున్నది
ది క్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్. 135

క. ఏ ననుట గాఁగ దుఃఖము
లైనవి దెగుసమయమయ్యె నని చెప్పుము, మీ
మేనత్త నూఱడింపుము,
దా నెప్పుడు నీవు గలవు తన కనుచుండున్. 136

వ. అని చెప్పి వెండియు. 137

ఆ. గురుఁడు బాహ్లికాదికురువృద్ధులును సుహృ
ద్బాంధవులు నశేషధరణిపతులుఁ
బ్రీతిఁ బొంద నెవ్వరికి నేది దగుఁ బ్రణా
మాదివిధుల నడపు నాదుపలుకు. 138

క. పరమప్రియమున నాకై
పరిరంభణ సేసి గాఢబాంధవసాంద్రా
దరమున సంభావింపు వి
దురుతోఁ, మధ్యస్థుఁ డగుహితుం డతఁ డనఘా. 139

వ. అనియెఁ దదనంతరంబ యర్జునుండు. 140

చ. జనులు వినంగ రాజ్యమున సాము గొనంగలవార మన్న యీ
జనపతికార్యనిశ్చయము సమ్మతి గైకొని చేసినఁ సుయో
ధనుఁడును దస్యులుఁ సఖులు, దానికి నేమును నియ్యకొందు; మొం
డనిన సపుత్త్రమిత్త్రముగ నద్దెస నందఱ గ్రొచ్చి పాఁతుదుఁ. 141

మ. అనినన్ మెచ్చి వృకోదరుం డితఁడు కార్యం బింత దెల్లంబుగాఁ
బొనరం బల్కెనయంచుఁ బేరెలుఁగుసొంపుం బొంద వక్త్రంబు, పొ
ల్పున దర్పం బొలయంగ నంగములకుం, బొంగారునుద్బృంహిత
ధ్వనియై పొల్చుమహోగ్రసింధురముచందం బొంది యొప్పెంగడున్.

క. నకుల సహదేవులును దా
నికి సంతస మంది యిట్లు నెయ్యము కయ్యం
బొక తెఱఁగు సేసికొని తడ
యక రమ్మని పలికి రప్పు డచ్యుతుతోడన్. 143

వ. ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయు మాటలు సెప్పి యతనిఁ గౌఁగిలించుకొని యథోచితప్రకారంబున వీడుకొని, వలగొని, మగిడిరి. తక్కినవారలు నర్థాంబులగు తెఱంగుల నామంత్రితులై మరలిరి. మాధవుండును ప్రయాణసర్వసంభారనిర్వాహకులఁ గలయం గనుంగొని తగినసల్లాపంబులు సేసి కరినగరంబు పెండెరువు గైకొని దారుకునిచతురత్వంబునఁ దురంగంబుల పటుత్వంబున నత్యంతసమీచీనం బైన యానంబున మనం బలరం జనిచని సూర్యాస్తమయసమయంబునఁ గుశస్థలంబు సేరం జనునప్పు డందలివిప్రు లెదురు వచ్చి కాంచి నిజనివాసంబులకుం జనుదెం డని పిలిచినం బ్రసన్నవదనుండగుచు సమ్మర్దంబు వలవదని పలికి విశాలరమణీయం బైనబహిరంగణంబునం బటకుటీరప్రకరం బెత్తించి విడిసి తగువారును దానును వారల గృహంబుల కరిగి యభ్యాగతపూజలు గైకొని వారిని సంభావించి విడిదలకుం జని సమయసముచితవృత్తిం బ్రవర్తిల్లుచుండె నంత నక్కడ. 144

తే. వార్త విని యాక్షణము కౌరవక్షితీశ్వ
రుండు గాంగేయగురువిదురులను బుత్రి
సంజయునిఁ గర్ణ సైంధవు శకునిఁ బిలువఁ
బనిచి తా నిట్టు లనియె నందనునితోడ. 145

వ. కృష్ణుండు పాండవకార్యార్థంబుగా మనయొద్దకు వచ్చుచున్నవాఁడు నేఁడు కుశస్థలంబున విడిసె రే పిందు వచ్చు నని వింటి మిట్టి యాశ్చర్యంబునుం గలదే సర్వలోకాభిగమ్యుం డగునమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి మన కింతకంటెను బెం పెయ్యది యతం డెవ్వరివలన సంతుష్టుం డయ్యె వారికి శుభంబును నెవ్వరిదెస ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుట దప్ప దతనికి వలయుపూజ లాచరించుటకు సంవిధానంబు సేయుము గృహాలంకరణాది మంగళప్రకారంబు లనుష్ఠింప నియమింపు మతని చిత్తంబున నీ విభవంబును దనమీఁది ప్రియంబునుం దోఁచునట్టి తెఱంగున సమస్తంబును సమకట్టుము. 146

క. అనిన ధృతరాష్ట్రుపలుకులు
గొనియాడిరి సంతసిల్లి గురుఁడును భీష్మం
డును నౌఁగా కని దుర్యో
ధనుఁడుం బరిచారకప్రతతిఁ బిలిపించెన్. 147

వ. ఇ ట్లుచితపరివారంబు రావించి యతండు. 148

క. అలుకుఁడు మృగమదమున ము
గ్గులు పెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమునఁ గో
డలు వ్రాయుఁడు మణిదామక
ములు గట్టుఁడు పెద్దకూటమున సొంపారన్. 149

వ. మఱియు నగళ్లెల్లను శోభిల్ల నలంకారంబు సేయుండు. 150

క. పెనుపుం జతురత మెఱయఁగ
మనయింటను దుస్ససేను మందిరమున శో
భనశిల్పము లొనరింపుఁడు
చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరము లిడన్. 151

వ. అది విడిపట్టుగాఁదగ దొకుప ట్లని పలికి వాసుదేవుండు రేపకడయు వచ్చు నంతకుమున్న యింతయుం గావింపవలయు నని పనిచి పురంబున నుత్సవంబు సాటుం డని నియోగించి వివిధగంధసహిత మాల్యంబులు సంపాదింపను మణిభూషణచిత్రాంబరంబులు సమకట్టను సరసాన్నస్వాదుపానద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరు లగు తద్‌జ్ఞుల నియమించె నట్టియెడ, నాంబికేయుండు విదురున కిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు విదురునితో శ్రీకృష్ణుని రాక చెప్పి సంతోషించుట.

క. వివిధమణిమయరథంబులు
జవనాశ్వంబులును భద్రసామజములు ర
త్నవిభూషణములు దాసీ
నివహంబులుఁ జాలఁ గృష్ణునికి నే నిత్తున్. 153

క. మనయింట సుయోధనుగృహ
మున దుశ్శాసనునికేతమున నెయ్యది యా
తనిచూడ్కి కించు నది యె
ల్లను గౌరవ మొప్ప నీ వలయు మన కనఘా. 154

చ. అన విని యాతఁ డిట్లనియె నంబుజనాభునిఁ బ్రీతుఁ జేయు కం
టెను హితమైనకృత్య మొకటిం గలదే, యది మేలు, పాండునం
దనులకు నైదయూళ్ళు లుచితస్థితి నిచ్చుట కోప మన్నయు
న్మిన యిటు లోవుకల్మి ధరణీవర యేమిట వచ్చెఁ జెప్పుమా. 155

ఉ. నీతలఁ పేను గంటి నొకనేర్పున శౌరికి లంచమిచ్చి సం
ప్రీతునిఁ జేసి కార్యగతి భేదము సేయఁగఁ జూచె దింత బే
లై తిగదే సుమేరుసదృశార్థముఁ జూచియుఁ బార్థుఁ బాయునే
యాతఁడు క్రీడిభక్తియును నచ్యుతు పెంపును నీ వెఱుంగవే. 156

తే. అర్జునుఁడు ప్రాణతుల్యుండు హరికి నట్లు
గాన జలపూర్ణ మంగళకలశమునకుఁ
బాద్యమునకును గుశలసంప్రశ్నమునకు
మిగుల నొండు జనార్దనుమెచ్చు గాదు. 157

క. మనకడకు నేమికార్యం
బునకై యాతండు వచ్చెఁ బూనికిమెయి నా
పని వంచింపక చేయుట
విను మతనికిఁ బ్రియము దక్క వేయును నేలా. 158

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కి ట్లనియె. 159

క. అది విదురుఁ జెప్పినట్టిద
తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వేఱగునే
పద నెఱుఁగ కేఁగి యిచ్చిన
బెదరి రనరె యొచ్చె మైనఁ బిమ్మట నగరే. 160

ఆ. అతఁడు పూజనీయుఁ డగు నేనెఱుంగుదు
నైన ధనము లీఁగి ననదతనము
వచ్చెఁ బెచ్చుపెరిఁగి వైరులు గర్వింతురు
రేల పగ యడంగు నిట్టు లైన. 161

క. అనవుడు భీష్ముఁడు ధృతరా
ష్ట్రున కిట్లను నీవునుం గొడుకు నేమే ని
చ్చిన నొకటి యీఁగి లేకు
న్నను వేఱొక్కటి దలంచునా కేశవుఁడున్. 162

క. విను మతఁడు సేయఁ బూనిన
పని దప్పింపంగ రాదు పాండవులం దే
ర్పను గృష్ణుఁడు వెరవుగఁ జొ
చ్చిన మే లాపురుషుపనుపు సేయుము పుత్రా. 163

క. నారాయణుండు ధర్మా
ర్థారూఢము గాఁగఁ బలుకు నది నీవును నీ
వారును గైకొని యెంతయు
గారవమునఁ జేయ నెల్ల కార్యంబు నగున్. 164

క. అనుటయు సుయోధనుఁడు భీ
ష్మున కిట్లనుఁ బాండురాజసుతులకు నిమ్మ

దిని హరి నగపాలీఁ డగు
ననుఁ బో యే నీనుగాని యది య ట్లుండెన్. 165

వ. నే లోకకార్యంబు సేయం దలంచితి నది వినుము పాండవులకు
నేడుగడయు జనార్దనుం డతనిం బట్టి బంధించిన తెక్కలువిఱిగిన
పులుఁగులుం బోలె వారునాకు విధేయు లగుదురు పాంచాలయాద
వాదు లైన తదీయబంధుమిత్త్రులు నావశంబున వర్తిల్లుదురు సమస్త
దేశంబులు నేన యేలుదు దీనికిం దగినయుపాయసహాయంబు
లనువు సేసెద నీ వింక నేమి సెప్పెదవు చెప్పు మనిన విని యతి
ఘోరం బగు నవ్విచారంబునకు సమాత్యసహితంబుగా సంతప్త
చిత్తుం డై వైచిత్త్రవీర్యుం డు గొడుకున కిట్లనియె. 166

క. ఓహో యిట్లనుట జగ
ద్ద్రోహం బిమ్మాట మఱవు దూతత్వంబున్
మాహాత్మ్యంబును ధర్మో
త్సాహంబును విను మభాగ్యతకుఁ గారణముల్. 167

క. ఈకారణములు గల వను
నాకోలఁదియె వాసుదేవుఁ డది గాకయుఁ గీ
డే కురువంశమున కతని
రాక యతం డేమి సేసెరా పాపాత్మా. 168

వ. అని యదల్చి నప్పుడు గాంగేయుం డాంబికేయున కిట్లను నీకొడుకు
ప్రాణగొడ్డం బైన కార్యంబు సేయం దలంచె దామోదరు నిట్లు
సేయం జూచెనేనిం దానును బ్రధానులును వినాశంబుఁ బొందుదు
రింతియ యిది సేసి రేమి సేయరేమి యమ్మహాత్మునెడ నీ యప
కారంబు విచారించిన దుష్టాత్ములు నష్టాత్ముల కాకయుని పలికి
యే నిట్టిదాని వినంజాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన
లేచిపోయె ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో నిటువంటి కొఱ
గాములు మనంబునం దలంచినప్పుడు సేయం గలవాఁడవు గావున
దీవం చేటు వచ్చు నుడుగుమయ్యా యని చెప్పి యతనిం దక్కిన
వారినిం బోవం బనిచి తగిన వర్తనంబున నుండె మఱునాఁడు. 169

సీ. కాలోచితము లగు కరణీయములు దీర్చి
కమలనాభుఁడు రేపకడయ కదలి
తనఁ గుశస్థలవాసు లనుప రా నందఱు
నాదరంబున నిల్చి యరుగునపుడు
గజ్జంబులును బంప్డు గంధమాల్యంబులు
ధృతరాష్ట్రసుతుఁడు వుత్తైరఁ బ్రీతి
నెడ నెడఁ గొనివచ్చి యిచ్చినగాని సె
ల్లను వేడ్క ననుభవించిన విధంబు
తే. సలిపి యనుభవ మొల్లక చనఁగ నెదురు
బాహ్లీక ద్రోణభీష్మాదిబంధుమిత్ర
గణము సర్వ భూపాలలోకంబుఁ గురుకు
మారవర్గంబుఁ బుత్తెంచె మనుజవిభుఁడు. 170

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని మందిరంబునకుఁ బోవుట.

వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు దక్క నెల్లవారిం దూర్యాదిశోభన పదార్థంబులు సమకట్టి ధృతరాష్ట్రుండు ననుప నెదుర్కొనిన వాసుదేవుండు వారల నందఱ నయ్యైతెఱంగుల సంభావించి కృతవర్మ దమవాఁడు గావున నతనికి సవిశేషస్నేహంబు సేసి యతండు సేరువ రా సమస్తజనంబులుం బరివేష్టింపం జని తన రాకకు నలంకృతంబును బ్రమోదచాపలసుభగజనంబును నైన పురంబు సొచ్చి రాజమార్గంబున నరుగు నవసరంబున మౌక్తికమిళితంబులు బహుగంధలుళితంబులు నగు నక్షతప్రకరంబులును బుష్పనికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మ్రొక్కుచుం జొక్కుచు నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలిచి కనుంగొను నంగనాజనంబులు తమలోన. 171

సీ. ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల
పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మె
చ్చించిన యీ జగజెట్టి యితఁడె

దుర్వృత్తుఁ డగు కంసుఁ దునిమి యాతనితండ్రిఁ
బట్టంబు గట్టిన ప్రభు వితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల
కోర్కె దీర్చిన రసికుం డితండె

తే. వెన్నలును గోపికాచిత్తవృత్తములును
నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె
శ్రుతిశిరోభాగములఁ దన సుభగచరణ
సరసిజామోదమును గూర్చు చతురుఁ డితఁడె. 172

వ. అనుచు సతి కుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధం బగు పౌరలోకం బాలోకనకౌతుకంబునఁ దన రథంబు గదిసిన సందడి జడియు వేత్రహస్తుల వారించుచు నారాయణుండు సమ్మర్దమంద గమనంబునం జని మణితోరణసుందరం బగు రాజమందిరద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగు మొగసాలఁ జొచ్చి యరదంబు డిగ్గి యల్లన నడచునప్పు డంతకు మున్న యరిగి భీష్మ ద్రోణ ప్రముఖు లగు వారలు ధృతరాష్ట్రునిం బొదువ నతండుఁ బ్రత్యుత్థానంబు సేసి విదుర సంజయ సహితంబుగా నెదుర్కొనం జేరి. 173

ఆ. అతనిఁ గౌఁగిలించి యచ్చటఁ గల విదు
రాదిశిష్టజనుల నాదరార్ద్ర
బంధుదృష్టిఁ జూచి పరిరంభసంభావ
నము లొనర్చి శౌరి ప్రమద మెసఁగ. 174

వ. వార లందఱకును సాత్యకిని దగిన సమాచారంబులు నడపం బనిచె నట మున్న ధృతరాష్ట్రపనుపునం దెచ్చిపెట్టిన నచ్చోటన యున్న యున్నతకనకాసనంబున నతం డునుప నాసీనుం డయ్యె నవ్వాసుదేవునకు విహితానుష్ఠానపరాయణు లగునగరిపురోహితులు రాజానుమతంబున నర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచారంబు లాచరించి యతని తమ్ముని నర్హపీఠంబున నునిచి యర్చించిరి నరనాథుం

డును దొరలును నిజోచితాసనంబుల నుండిరి. కొలువెల్లను సూర్యోదయ సమయంబునఁ గమలాకరంబు విధంబున వికసించియుండె నయ్యవసరంబునఁ గృష్ణుండు ధర్మనందను వచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామపరిరంభణప్రముఖసముచిత సంభావనంబులు పలికి సంభాషణంబులకుం జొచ్చి.

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు
పూజావచనముల, నెయ్యపుంబలుకులఁ, జే
రోజమొయి బంధుమిత్త్రస
మాజములకు, మేలములఁ గుమారులకుఁ దగన్. 176

వ. ఇంపు పుట్టించుచుఁ గొండొకసేపు నిలిచి పుండరీకాక్షుండు విదురుసదనంబునకుం జనియెద మఱియుఁ బోవలయు నెడలకుం బోయి వచ్చెద నని పలికి యాంబికేయు ననుమతి వడసి యరుగ విదురుండు ససంభ్రమంబునం గడచి చని మంగళోపచారసహితంబుగా నెదుర్కొని భయభక్తివినయస్నేహానందంబులఁ గందళితుం డగుచు గోవిందునకు దేవోపచారంబుల ననేకప్రకారంబుల నర్చన లిచ్చి కౌంతేయులకుశలం బడిగిన నతనికి వారలవృత్తాంతంబు సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిన యనంతరంబ. 177

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ
సదనమునకుఁ జనియె నపుడు సమ్మదమున న
వ్విదురుం డోగిర మొనరిం
చెద నని తన్నడుగ నట్లు చేయుండనుచున్. 178

వ. చని కాంచిన నద్దేవియు నతనితోడునీడయుంబోని తనకొడుకులం దలంచి యడలుపుట్టిన నమ్మాధవుమెడ పట్టికొని యెలుంగెత్తి యేడ్చిన నతండు సంబోధించి యూరార్చ నెట్టకేలకు నుడిగి యాతనికి నాసనవిన్యాసనాద్యుపచారంబులు సేయించి తత్సమీపంబున నుచితపీఠంబునం గూర్చుండి గద్గదకంఠంబుతో నిట్లనియె. 179

సీ. సిరిచెడఁ జెడుఁగుట సిరిమంతులం బుణ్య
 పరులు శౌచులుగదా పాండుసుతులు
సుఖవృత్తిఁ జెక్కులంజేసూరెలఁ గొలువ నుం
 డెడువారి వినయములఁ బడుచు నిర్జ
నం బైనకానలోనన యెట్లు సలిపిరి
 ననుఁ బెట్టి నాయెద గొనుచుఁ జనిరి
యేను వర్ధింపంగ నిం వారఁ గుడిచి మె
 త్తనిశయ్య నిద్రించి వినుతభద్ర

తే. గానకరిబృంహితముల మేల్కాంచునట్టి
వారు కందమూలంబు లాహారములుగఁ
బొదలఁ బుట్టలఁ బడి యుండి పులుఁగు మెకము
లఱవఁ మేల్కాను చుండిరే యక్కటకట. 180

ఆ. తండ్రిలేని ప్రజలు దల్లిని బాసి పె
ద్దయనుగాల మిట్టిదనఁ బడిరి
భంగపాటు దుఃఖపాటును సంకట
పాటుఁ గలిగె విరటుపాలఁ బడప. 181

వ. అని వెండియు. 182

ఉ. దానదయాపరుం డయినధర్మతనూభవు సేమ మెట్లు, పం
చాననవిక్రముం డగు బకారికి భద్రమొ, యుగ్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖయా, వినయాభరణుల్ గవల్ సమా
ధానసమేతులే, యకట ద్రౌపది సాధ్వి, సుఖంబె దానికిన్. 183

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁగోడలి కెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తి కట కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁ జేయుచుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య కొ
త్తడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట చూచి పోక్కితిన్. 184

తే. నాఁడు ద్రౌపది పడినబన్నములు సూడ
నోర్చినప్పుడ యెంతకు నోర్వఁ జెపుమ

యంతగడచినదుఃఖంబు లనుభవింపఁ
గలవె లోకంబువారికిఁ గమలనాభ. 185

వ. అట్టియెడ. 186

క. విదురుం డొక్కఁడు దక్కఁగ
సదస్యు లెవ్వరును ధర్మసంక్షయ మిది సూ
డదు నార యతనిశీలము
కుదు రీలోకమున కింతకుం దలఁపంగన్. 187

వ. అని యివ్విధంబునఁ గృష్ణునితోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ
ద్రవ్వికొని శోకంబు వెల్లిగొనఁ గొండొకదిగం బాఱెడుచిత్తంబుతో
మఱియు నిట్లనియె. 188

క. ఇది యెల్లను నొకతల యా
పదమూఁడేఁడులును నాకు బావకొడుకుచే
నదయ మగుకూడు గుడుచుట
యదియొకతల యయ్యో నేమియనఁగల ననఘా. 189

క. తన్నుఁ దనతమ్ములను నా
కన్నకొడుకులట్ల తలఁతుఁ గాని విభేదం
బెన్నఁడు నామది లేమికి
వెన్నుఁడ దైవంబ సాక్షి వినుము పలికెదన్. 190

క. ఇది నిక్కంబగు నేనియుఁ
దుది నీవుం బాండవులును దురితరహితు లై
ముద మందఁ జూడఁ గనియెద
నది దీనికి మందు సువ్వె యంబుజనాభా. 191

సీ. బావ యొప్పం దనుపలుకుల నే మగు
నాతనికొడుకుఁ గీడాడ నేల
కురువృద్ధుఁ డగుబాహ్లికుని దూఱ నేటికి
భీష్మునిపైఁ బ్రాయి వెట్ట నగునె

యుష్టికూడ్రిరులయింటి కిచ్చిన మనవారి
నందుఁ గా కట్లు దా ననుట మేలె
యర్జునుపుట్టినయప్పుడు వీఁడు లో
కము లెల్ల గెల్చు, బాగ డ్త మొగులు

తే. మ్రుట్టునట్టిద యగు, రణమున జయించుఁ
గౌరవుల, సోదరులుఁ దాను భూరిరాజ్య
గౌరవముఁ బొందు నని యశరీరవాణి
వలికె నది దిట్టువడు-గాక వలయు నేని. 192

వ. ధర్మంబు గలుగునే నది నిక్కం బయ్యేడు దాని కెల్లను నిర్వాహ
కుండవు నీవు గలవు గాదె నీమన్నించునెచ్చెలులకుం జెప్పెడు
మాటలు గలవు విను మయ్యుధిష్ఠిరుతో నిట్లనుము. 193

క. వేఁడికొని కృపణు లై కను
వోఁడిమి యది యేల రాజపుత్రులు దమమై
వాఁడిమి దప్పిన నిప్పలు
వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే. 194

వ. భీమార్జునుల కి ట్లని చెప్పుము. 195

ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి
నట్టిపనికి నుచితమైనసమయ
మొదవెఁ దడయ టింక నొప్పదు జనములు
నట్లుగాని పురుషు లనరు మిమ్ము. 196

క. భుజబలమున జీవించుట
నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా
త్మజఁ గార్యంబునగు మనుము తగ నందఱితోఁ. 197

చ. అలిగినభీమఫల్గునుల కడ్డము లేమి యెఱుంగు దంతలం
తలు వడి వాని నీఁగ వలదా విను మాపని కెల్లఁ బాండుపు

తుత్రిలె కలవారు నీ కెటులు దోఁచిన నట్టులు సేయువారు గా
కలఘువిచార నాయలఁత యార్పను నన్ గడతేర్పు మెమ్మెయిన్.
వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యిట్లనియె. 199

శ్రీ కృష్ణుఁడు గుంతీదేవి నూఱడించుట

చ. సుగుణవు పుట్టినింటికిని చొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ
దగుచరితంబునన్ నడచు ధన్యవు ధీరవు దేవి నీ వెడ
న్వగ లడఁగింప కున్న భువనంబుల నింకిట నెవ్వ రోర్చువా
రు గలరె దక్కుమీ హృదయరోగము లన్నియుఁ బుచ్చివైచెదన్.
క. తనయులుఁ గోడలు సేమం
బున నున్నా రధికభక్తిపూర్వముగా దం
డనమస్కారంబులు నీ
కొనరించిరి కౌఁగిలించి రుల్లములఁ దగన్. 201
క. నీకొడుకు లొండుసుఖములు
సేకొన రవ్వీరసుఖము చిత్తములఁ గరం
బాకాంక్షింతు రలంతులఁ
బోక గలుగు నెట్టు లల్పబుద్ధులె వారల్. 202
క. ఉత్సాహంబున శత్రుకు
లోత్సాదనవిధి యొనర్చి యున్నతసామ్రా
జ్యోత్సవము నొందుపుత్రుల
నుత్సుకతం జూతు గాక యూఱడు మింకన్. 203
చ. అన విని మోము విచ్చుచు మురారికి నిట్లనుఁ గుంతి పాండునం
దనులకుఁ దండ్రియున్ గురువు దైవము నారయ నీవ కావె నీ
మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్లు చే
సి నెగడువారు గాక నినుఁ జేరిన నాపద నొంద నేర్చునే 204
క. వారలకయేల మాధవ
కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం
జేరుగడ నీవ నీపలు
కారయ వేవంబ కాదె యఖిలంబునకున్. 205

వ. అనినం బ్రసన్నవదనుం డగుచు నద్దేవి గారవించి యామంత్రి
ణంబు సేసి తదావాసంబు వెలువడి తనరాకకు నలంకృతం బైన
దుర్యోధను మందిరంబునకుఁ గృతవర్మ సాత్యకిసమేతుం డయి
పోవుగోవిందునిం గని తదీయద్వారపాలకులు సంభ్రమంబునం బఱచి
యతని కెఱింగించి తదనుమతంబునం బఱతెంచి యెదుర్కొని
కక్ష్యాంతరంబుల సందడి నెడ గలుగ జడియుచు వినయంబునం
దోడ్కొని చన నమ్మనుజవిభుండు కైలాసశిఖరాకారం బగు సౌధం
బున బాహ్లికభీష్మద్రోణప్రభృతులును గర్ణశకునిసైంధవాదులును
దుశ్శాసనవికర్ణదుర్ముఖ ప్రముఖులును మఱియు ననేకదేశాధీశు
లునుం బరివేష్టింపఁ బేరోలగంబున సింహాసనాసీనుం డై యున్న
యెడకుం జనునప్పు డాసుయోధనుండు సపరివారంబుగాఁ బ్రత్యు
త్థానంబు సేయం జేర నరిగి యతనికిం దగువారలకు నాలింగనా
ద్యుపచారంబులు దానుం దమ్ముండును నాచరించి. 206

క. అతఁ డనుపఁగఁ గనకమయో
న్నతపర్యంకంబునందు నారాయణుఁ డూ
ర్జితమహిమ నుండి యభ్య
ర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతులన్. 207

శ్రీ కృష్ణుఁడు దుర్యోధనునితోఁ సంభాషించుట.

వ. సాత్యకియును సముచితప్రకారంబునం బూజితుం డయ్యె దదనం
తరంబ నిజాసనాసీను లయి తన మొగంబునం జూడ్కి నిలిపి
యున్న దుర్యోధనాదులతో మాధవుండు మధురసంభాషణంబులు
సేయుచుండె నట్టియెడ. 208

తే. సముచితంబుగఁ గూరలచంద ముగ్గ
డించి కుడుపు తెఱంగు పుట్టించి పలుకు
నాసుయోధనుతోఁ గృష్ణుఁ డచటఁ దాను
గుడువ నొల్లక యునికి యేర్పడగఁ జెప్పె. 209

వ. చెప్పినవిని దుర్యోధనుండు సూర్యసూనువదనం బవలోకించియుల్లన
యి ట్లనియె. 210

క. హరి పలికినవిధ మెంతయు
నెర వై యున్నయది వింటె యిమ్మాట తెఱం
గరయుదము తొలుత, నీవెచు
పరిచందం బెల్ల నెఱుక పడియెడుఁ బిదపన్ 211

వ. అని యచ్యుతున కిట్లనియె. 212

తే. వలయునన్నపానంబులు పలుదెఱఁగుల
నేర్చువిధముల నేమొడఁగూర్చి వేడ్క-
నున్న నీ వుపయోగింప నొల్లకునికి
బాంధవమునకు నీతికి బాహిరంబు. 213

క. కౌరవులకుఁ బాండవులకు
నారయ నీ వొక్క-రూప యసదృశధర్మా
చారుండవు రాజునకుం
గూరుతు గత మేమి యిట్లగుటకుం జెపుమా. 214

క. అనుడు నుపేంద్రుఁడు మనుజేం
ద్రున కిట్లను మాత లెందుఁ దొలిదొలి గుడువం
గొనఁ గట్టఁ దొడఁగుదురె వ
చ్చినకార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్. 215

వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కిట్లనియె. 216

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱుఁ
దీఱ కుండు దాని తెఱఁగు దగిన
యప్పు డాడ రాదె యిప్పుడు ముకుంద్రాటఁ
గాలు గ్రువ్వ నేల కమలనాభ. 217

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్ల పనులుం జెప్పుట యొప్పుఁగాక కుడువ నొల్ల ననం దగునె దీనికిం గారణంబు నాయెఱింగినయది లేదు విచారింపక పలికి తనిన మందరధరుండు మందస్మితంబుతో నందఱుం గలయం గనుంగొని ధారరాష్ట్రికరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చులీలం గేల

నమర్చి యిట్టిమాటలు తేటపఱుప వలయునేని వినుమని యతని
కి ట్లనియె. 218

చ. ప్రియ మొసఁగం దగం బిలిచి పెట్టెదుకూడది లెస్సకూడు ద
క్కఁయ నయహీనతం బమకు నాపద యై నెడ నిట్టు నట్టు నే
మియు నన లేనికూడదియు మేవడి యై చను నీవు మాదెసం
బ్రియుఁడవు గావు మాకు ధృతిపెం పఱినాపద లే దొకింతయున్.

వ. అట్లుం గాక. 220

క. పగవారియింటఁ గుడిచిన
నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ
దగ దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో. 221

వ. నేను బగి తుండనె యుంటేని. 222

క. అలుగుదు పాండవులకు వా
రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టలముగఁ దమ ప్రాణములకు
నలుగఁ జనులు పగతు రగుట యనుమానంబే. 223

ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య
మాది గాఁగ గీడె యాచరింతు
పుణ్యపరులు దోడఁ బుట్టువు లార్యులు
వైర మెత్తఁ దగున వారితోడ. 224

వ. ఇట్లున్న మీయందఱ యన్నంబులు దుష్టాన్నంబులు విదురుం
డొక్కని యన్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితిఁ గావున నందుఁ
బోయెద నని చెప్పి యజ్ఞనపతి యనుమతి సేయఁ జనునప్పుడు తోడన
బాహ్లికభీష్మాదికౌరవులును గుంభసంభవప్రముఖు లైన మాన్యు
లును జని మాధవుతోడ మా యిండ్ల నెల్లను గానికలాయితంబులు
సేసికొని నీవు విజయంచేయుటకు నెదుళ్ళు చూచుచున్నవార మని
పల్కి ప్రార్థించిన నే నన్నిచోట్లకు వచ్చినవాఁడన యందఱ యర్చ

నలుం గైకొంటిరి మీరు నిలువుం డని వారల నిలిపి విదురుగృ
హంబునకుం బోయిన. 225

సీ. సంభ్రమస్నేహనిశ్చలభక్తియుక్తిఁ బ
విత్రమజ్జనము గావించి విదురుఁ
డెల్లవంటకములు నేర్పడ బోనాలు
వేర్పించ నెంతయుఁ బ్రీతి మీఁద
రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి
సపరివారముగ విశాలరమ్య
పూతస్థలంబునఁ బుండరీకాక్షుండు
దమ్ముండుఁ దాను నుత్సవ మెలర్ప

తే. సరసరంజకమహనీయ సంప్రయోగ
మగు చతుర్విధహృద్యాన్న మారగించె
లలితసంభావనామంజులంబు లైన
పలుకు లెడనెడ విదురున కెలమి యొసఁగ. 226

వ. అతండును. 227

క. గోవింద సంభ్రమము సం
భావింపుము మాకు నిదియ పరమధనం బొం
డేవిధమున నీ కర్చన
గావింపం జాలువాఁడు గలఁడే యెందున్. 228

వ. అని మఱియు నత్యంత వినయవాక్యమ్ముల నారాధించుచుండె నిట్లు
కృతాహారుం డైన హరికిఁ జందనచర్చాద్యర్చనంబు లాచరించి
యవ్విదురుండు కృతార్థుం డై యుండఁ గవిగణికప్రముఖనిఖిలవిద్వ
జ్జనంబులు గాయకపాఠకవాంశికవైణికాది వినోదపాత్రంబులు
నప్పరమేశ్వరుం గాన వచ్చి పొద్దు వుచ్చి యభిమతార్థంబులు
వడసి చనిరి రాత్రి యగుటయుం దగిన యభ్యంతరమందిరంబున
హంసతూలికాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచి
తాసనంబున నుండి. 229

ఆ. విదురుఁ డిట్టు లనియె నిదియొక కార్యంబు
గాఁగఁ బూని యిందు రాఁగఁ దగునె
దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ
మాట వినునె దురభిమానఘనుఁడు. 230

క. వచ్చిన సైన్యంబులఁ గని
పెచ్చు పెరిఁగినాఁడు ద్రోణభీష్ముల లావుల్
నచ్చియుఁ గర్ణుం డొక్కఁడ
యిచ్చు దనకు విజయమనియు నెంతయుఁ బొంగున్. 231

వ. నీ విట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడం బోఁటి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘింపం గలవారు పాండునందనులకు నేమియు నీ కుంకువారు దార యీ ధాత్రియంతయు బీఱు వోవకుండ నేలువారు వారిం గూడిన రాజు లెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగపడినవారు గావునఁ గర్ణుతో నేకార్థులమై చత్తుము గెలుతు మింతియ కాని యొండు లేదని నిశ్చయించుకొని యున్నవా రట్లగుటం జేసి దుర్యోధనుండు గండు మిగిలియున్నవాఁడు సంధి గానేరదు వారల కందఱకు నిది ప్రాప్తకాలంబై యున్నయది యెట్లును నుడుగనేర్చినవారుగా రిట్లు ద మ్మెఱుంగని దుష్టాత్ముల నడుమం గూర్చుండుటయు నవ్వెంగలివిత్తు లఱచు పీఱేఁడి యఱపులకు వంకలొత్తి మాఱు సెప్పుటయు నొప్పకయుండు వెడంగులగుటం గార్యవచనంబు లెఱుంగరు మొఱకు లగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు వారల తలంపులు గీడు నీ మహనీయప్రభావబుద్ధిపౌరుషంబు లే నెఱుంగుదు నయినను బాండవేయులపై స్నేహంబునను నీమీఁది భక్తినిం జెప్పెద నందుఁ బోవలవ దనిన వాసుదేవుం డతని కిట్లనియె. 231

తే. నీ వివేకంబు నా ప్రియము నెఱపితీవు
తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి

తేను నారాక తెఱఁగెల్ల నేర్పడంగఁ
జెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ. 233

శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట.

క. ఎఱుఁగుదు నేను సుయోధను
కొఱగామియు శకునితోడఁ గూడిన నృపు లం
దఱుఁ బగ మనమున నిడికొని
యఱుముటయును సంధి పొసఁగదనియు మహాత్మా. 234

ఆ. పుడమియెల్ల నొడ్డగెడవయి గజవాజి
యుతముగాఁ గడంగి యుగ్రమృత్యు
ముఖము సొరఁగఁ దివురు మూర్ఖత మాన్పుట
యధికమైన పుణ్య మనఘచరిత. 235

వ. మానుపవచ్చునే యంటేని. 236

క. దొరఁకొని పుణ్యముఁ బాపము
నరుఁ డర్థిం జేయుచుండ నడుమ నొకట న
వ్వెర వెడలి తప్పినను ద
త్పరిణతిఫల మొందునండ్రు ధర్మవిధిజ్ఞుల్. 237

వ. అట్లుం గాక. 238

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గోట్లాడియైనఁ
దాని యుడుపంగఁ జూరకున్న వానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు. 239

వ. కావున నీరెండుదెఱంగులవారికి శాంతి గావింపం బ్రయత్నంబు
సేసెద ధర్మార్థహితం బైన తెఱంగుమాటలు మంత్రిజనసహితుం
డైన సుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లో
కంబులకు హితం బయినవిధంబు వంచన లేక చెప్పెడు నన్ను పాం
డవులవాఁ డని శంకించి యతండు నామాట వినం డయ్యె నేనియు
మేల కాక యిట్లు సొచ్చి చెప్పకున్న నన్నదమ్ములు దమలోనం

బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదా యని యజ్ఞులైనజను లాడుదు రెల్లభంగులం గార్యం బార్యు లియ్యకోనం జెప్పఁడు ధార్తరాష్ట్రులుం దమకు బ్రతుకుతెరు వైన నాపలుకులు వట్టునుడు వట్టక నీతలంచినచందమునం దులువ లై కలగంబాఱిన వారు నాముందర నిలువంజాలుదు రే యని పలికిన విదురుం డట్లకాక యని సమ్మతించి యామంత్రణంబు సేసి నిజ శయనస్థానంబునకుం జనియె ననంతరంబ. 240

ఆ. అతనివచనరచన యాత్మలోఁ దలపోసి
యిట్టివాఁడు గలఁడె యెందు ననుచుఁ
బాలకడలికడల పాటి యై యొప్పు న
ప్పాన్పునందు శౌరి పవ్వళించె. 241

వ. ఇట్లు సుఖనిద్ర సేసి వేగుంబోకట మాగధమంగళగానంబుల మేలు గాంచి సమయకర్తవ్యంబులు సలిపె నట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం బురుషోత్తముండు వారలు మొదలుగాఁ గలయిష్టజనంబులు పరివేష్టింప నుచితప్రదేశంబున నున్నంత, 242

క. ఇనతనయశకునిదుశ్శా
సనసహితము గాఁగ నెలమిఁ జనుదెంచి సుయో
ధనుఁడు ప్రియోక్తులఁ దగువా
రును దానును వారిజోదరుం గొనియాడెన్. 243

వ. అతండును మధురసంభాషణంబుల సేయ వార లతనికి ధృతరాష్ట్రుండు బంధుమిత్త్రాదిసమస్తపరిజనసమన్వితుం డయి పేరోలగంబున నునికి యెఱిఁగించినఁ బ్రియంబునఁ గట్టాయితం బైన తేరెక్కి భేరీశంఖచామరప్రముఖభద్రచిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మసాత్యకు లొక్కరథంబునను దుర్యోధనాదిదుష్టచతుష్టయం బొక్కరథంబునను బార్శ్వంబుల రాఁ జాఱులకుఁ గన్నులపండు వగుచు రాజమందిరద్వారంబు సేర నరుగునప్పటి యులివునకుఁ గొలువువా రెల్ల నత్యుత్సుకులై యెదురు చూడ రథోత్తమంబు నవతరించి యరవిందనాభుండు. 244

తే. ఎదురువచ్చిన విదురుని యుచితముగ
దమ్మ చేయును రెండు హస్తములఁ బట్టి
నడచె ముందటఁ గదియ సంజయుఁ డేగి
కర్ణదుర్యోధనులు దోడుకొనఁగ నరయ. 245

వ. కృతవర్మాదియాదవులు సాత్యకియు నభ్యంతరు లైన బలుమానసులు పాదివిరోధి పోవఁ బదుమాహాంబునఁ గౌరవులు రవిసన్నిధి తారాగ్రహంబులచందం బగుచుండఁ దేజోరాశి యగురాజీవాక్షుండు సని తనకుఁ బ్రత్యుత్థానంబు సేసిన కురురాజును దొరలను నభినందించుచు. 246

క. తనకని పెట్టిన మణిమయ
కనకోన్నతపీఠమునఁ బ్రకాశంబున ని
ల్చినయెడఁ దోఁచిరి నారద
మునిప్రముఖు లంతరిక్షమున సజ్జ్వలు లై. 247

వ. ఇవ్విధంబున సన్నిహితు లయినయమ్మహామునులం గురుపితామహునకుం జూపి నారాయణుం డిట్లనియె. 248

ఆ. మనలఁ జూచువేడ్కఁ జనుదెంచినారు మ
హాత్ము లైననారదాదిమునులు
వీరి కర్ఘ్యపాద్యవిధు లాచరింపు మా
సనము లిడఁగ బనుపు సత్వరముగ. 249

వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట దగవు గా దనినం గొలువువారెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునుల వలన చూచుచుండ భీష్ముండు పరిచారకులం బనిచి కనకమణిమయాసనంబు లనేకంబులు దెప్పింప నారు లరుగుదెంచిన వారలకు నమస్కరించి యాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజలు సేయించి కృష్ణుండు గూర్చున్న యనంతరంబ ధృతరాష్ట్రుండునుం దక్కటి వారును నుచితప్రకారంబున నమ్మునీంద్రులకు నభివందనంబులు సేసి నిజాసనాసీను లైరి. దుశ్శాసనుండును వివింశతియును గద్దియ

లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరువంకలం గూర్చుండిరి. కర్ణదుర్యోధనులుం జేరువనొక్కగద్దియ నుండిరి. విదురుండును మణిపీఠంబునఁ గృష్ణుని వెనుకదెసఁ దదీయోన్నతపీఠంబునఁ గరం బత్తమిల్లియుండె. గాంధారరాజు నిజపుత్త్రపరివృతుం డై యొక్కదిక్కున నుచితపీఠాసీనుం డయ్యె నట్టిసమయంబున. 250

క. అంబుదశుభగాత్రుం బీ
తాంబరధరుఁ గమలదళనిభాక్షు హరిం జూ
డం బడసి లోచనము లమృ
తం బానినమాడ్కి సమ్మదంబునఁ దేలన్. 251

క. ఆకొలువువారు గర మచ
లాకృతి నొకపలుకు లేక యుండఁ బింజం
బాఁ కిడినకరణి నవశము
దాకారితచిత్తవృత్తులై యుండంగన్. 252

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట.

క. జలదస్వనగంభీరత
నెలుఁ గొప్పఁగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరుచెవుల నఖిలజనం
బులు విన ధృతరాష్ట్రభూవిభున కి ట్లనియెన్. 253

క. జననాథ నీయెఱుంగని
పనులు గలవె యైనఁ దగవుఁ బరమహితంబుం
దనవారికిఁ జెప్పిన తగు
పని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్. 254

క. క్షీరోదకగతిఁ బాండవ
కౌరవ లొడఁగూడి మనికి కార్యం బది నీ
వారసి నడపుము వా రన
వీ రనఁ గురుముఖ్య నీకు వేఱుం గలదే. 255

వ. భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం గరుణయుఁ గల్గి యుండు ననఁగా నుతిఁ గన్నది, యందు సద్గుణో

త్తరులరు నీవు నీ యనుఁగుదమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధర శుభశీలు రీసుచరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్. 256

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు రిం దెవ్వారిచందంబు లె
ల్లై వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబుగా జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ. 257

చ. వినుము సుయోధనాదు లగువీరు సధర్ములుగాక, కార్యము
ల్గానక, మహార్థసిద్ధి యెడలుం దమ కి ట్లన కన్యాయంబువ
ర్తన మిదిగాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బుయిలోడ రేమియున్. 258

ఉ. కౌరవపాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల మంతకు నీనృపకోటి కుర్విఁకిం
బోరిత మైన నింతకును బుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణుతించి యవశ్యముఁ బొం దొనర్పవే. 259

తే. నీకు వలసినఁ దీర్పంగ నేర వచ్చు
నధిప తెఱఁగు నీవశమునయదియ కాన
నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె
సిద్ధ మెవ్వారిఁ దెలివందఁ జేయ నేర్తు. 260

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱో యెన్నమా యిచట నీగురుభీష్ములఁ గ్రేణి సేయువా
రెందఱో వారు వీరు నని నిల్గుటకంటె భవద్బలంబులై
యందఱుఁ గూడు టొప్పదె జనాధిప శాంతి యొనర్పు మెమ్మెయిన్.

తే. జగతిఁ గలజనపతులు నీచరణపీఠ
మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లిప్రజల
యెడ విరోధంబు వాటించు టెంత మేలు. 262

క. నరనాథ నీ వుపేక్షా
పరుఁడ వయినఁ గౌరవ్యులకఁ పాండవులకఁ గా
దరయఁగ భూప్రజ కెల్లను
దురితం బొనరించినట్లు తుదిఁ గీడు సుమీ. 263

క. కౌరవపాండవులం దె
వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మే లు
ర్వీరమణ చిత్తమున నె
ట్లారయుమా నీకు దుఃఖ మగు నెట్లయినన్. 264

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోనిచిత్తబవరంబున నాఱడిఁజావ బోవ నె
ట్లూరక యుండవచ్చు కనునొప్పుమేనులు వాడికైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట యోర్వవచ్చునే. 265

ఆ. ఇట్లు గాక యుండ నీరెండుదెఱఁగుల
వారిఁ గాచికొనుము వసుమతీశ
నీకుఁ బ్రాభవంబు నీతియు శాంతియు
నఖిలజనులుఁ బొగడునట్లు గాఁగ. 266

వ. అని చెప్పి వెండియు. 267

శ్రీకృష్ణుఁడు పాండవులు సెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

తే. పాండవులు దండ్రిసచ్చిన ప్రజలు వారి
నరసి ప్రోచితి శైశవ మాదిగాఁగ
నడుమ నిష్కారణమ దిగవిడువఁదగు నె
పార మొందంగ రక్షింపు గారవమున. 268

వ. పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యుండఁటు నొక్క
మాటగా నీతోఁ జెప్పు మని నాకుం జెప్పినవిధంబు వినుము
తపసంబునం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి
పదుమూఁ డగునేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జలిపితిమి
మాతండ్రిసమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్లునుం

బడయుదు మని కృతనిశ్చయుల మై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేమగడయుదు మాకుఁ దాన మూవలన నేరమి గల్గినం గినిసి యిట్లుగా దట్లని చక్కం బెట్టుకది తనగలపదివే లేండ్లకుం దన్న కాని మఱి యెఱుంగ మెట్టివార మైనను మమ్మును దుర్యోధనాదులనుం దలంపరు తెనయందుఁ దెఱంగు గలిగిన నెవ్వారు గొఱ గాకున్నను గులంబుపాడి సెడక చెల్లు నని రని పలికి మఱియు నిట్లనియె. 269

ఉ. సారపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బొఱిన దైన యవస్థ దక్కు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్. 270

వ. అని యీసభ్యులకుం జెప్పుమని రీవును సభాసదు లైనరాజులు నే మనియెవరనుం డేను ధర్మంబును నీతియుసు మున్నిడికొని మనో వాక్ప్రికారంబు లేకరూపం బైనసత్యంబ కాఁ జెప్పితి నిత్తెఱంగు మీాకు మేలు క్రోధమానమత్సరంబులు విడిచి యిట్లు సేయుఁడు. 271

ఆ. పాండవులకుఁ దగినపాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు
ధర్మ మెద్ది సముచితం బగువిధ మెద్ది
శక్య మెద్ది చెపుఁడ వాక్యవిదులు. 272

క. అని పలికి మహారాజా
విను మని ధృతరాష్ట్రుతోడ వెండియుఁ దా ని
ట్లని చెప్పె వాసుదేవుఁడు
తన మది నఱలేక కార్యదశ దెలియంగన్. 273

ఆ. వారి తండ్రిపాలు వారికి నిచ్చి నీ
పాలు నీవుఁ బుత్రపౌత్రచయము
ననుభవించి సుఖుల రై యుండుఁ డిది బంధు
మిత్ర సుజనకోటి మెచ్చు తెఱఁగు. 274

క. ఎఱుఁగవె యజాతశత్రుని
నెఱియును ధర్మంబుఁ సత్యనిష్ఠయు మిగుల న
న్నెఱుఁగున ననువర్తించెనో
యెఱుఁగవె తగఁ జేవ గలుగు టెఱుఁగవె యధిపా. 275

వ. నీ వెఱుంగు తైనను జెప్పెద విను మింద్రప్రస్థపురంబున నుండి
పాండవాగ్రజుండు నీకుం బెంపునం బేరునుం జేయం గోరి. 276

చ. మద మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదు నని పూని దిగ్విజయ మున్నతిఁ జేసి మహావిభూతితో
మదిమది నుండ నీసుతుఁడు మంత్రులు సౌబలు జూదమార్చి సం
పద గొని యంతఁ బోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే. 277

ఉ. దానికి నీ వొడంబడితి ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు బొంకులుగాఁ బెడచేతఁ గన్న నీ
రూనఁగ నొత్తుకొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నుఁడై
దీనతనుండి పూన్కి దగఁ దీర్చియుఁ గూడి మనంగఁ గోరెడిన్. 278

క. తనుఁ దాన పోలుఁ గాకే
మన వచ్చు నజాతశత్రు నతిశాంతతయున్
వినయము గౌరవమును నే
జనపతులకుఁ గలవు చెపుమ సౌజన్యనిధీ. 279

క. ఏ నింతాడితి నీ సం
తానం బిరుతెఱఁగునకు హితము గోరి భవ
త్సూనుని మతి యతిలోభము
మానిచి పాండవులఁ దెమ్ము మనుజాధీశా. 280

ఉ. వారలు శాంతశూరులు భవచ్ఛరణంబులు గొల్వఁ బూని యు
న్నా రటుఁ గాక మీ కది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండుతెఱంగులందు నీ
కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా. 281

చ. అనవుడు రోమహర్షణము లంగములం బొడమన్ సదస్యు లె
ల్లను బ్రియమంది సన్నుతవచోబలం బురుషోత్తముఁ డింత యొప్పఁ బ
ల్కునె మఱి యిమాటలాడఁ గ యకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం
దను వరి యెవ్వఁ డంచు సచలాక్షులై నెరి నూఁకుండఁగన్. 282

. . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . .

వ. అంతట ధృతరాష్ట్రుం డిట్లనియె. 283

ఆ. మందబుద్ధి నా దుర్నందనుఁ డీవు పో
రానిచుట్టమవు మహానుభావుఁ
డవు దయార్ద్రచిత్తుఁడవు వీనిఁ దేర్పవే
యనున యించి యెట్టులైనఁ గృష్ణ. 284

క. అనిన ముకుందుఁడు దుర్యో
ధనుతో నిట్లనియె విమలతరవంశమునన్
జనియించి తెల్లగుణముల
ననూనుఁడవు నీకు నీ దురాగ్రహ మగునే. 285

చ. తులువలు గాక యిట్టిదారు దుర్ణయవృత్తికిఁ జొత్తురయ్య పు
త్త్రులు ననుజన్ములుం జెలులు దుష్టపథంబునఁ బోవకుండఁ జు
ట్టలుఁ దగువారుఁ దండ్రియు నొడంబడఁ జేయుము కార్య మల్పబు
ద్ధుల వెడమాట లూఁకొనకు దోసము సేగియు వచ్చు నమ్మేయిన్.

క. పాండిత్యశౌర్యనిత్యులు
పాండుసుతులు వారిఁ గూడి బ్రదుకుట ధృతరా
ష్ట్రుండును బాహ్లికుఁడును భీ
ష్ముండు గురుఁడు గోరు తెఱఁగు సూవె నరేంద్రా, 287

ఆ. విను మసత్యలోభమున సిరి యగునె యూఁ
కొని ముసిండి దినినఁ గ్రొవ్వులావుఁ
గలుగునయ్య శకునికర్ణదుశ్శాసన
మంత్రితంబు గార్యతంత్ర మగునె. 288

శా. తోడం బుట్టిన భీమపార్థులు మహోదోర్దర్పముల్ లాఁతులై
తోడంచుం బెఱవారి దుర్బలుల నెంతేఁ జొచ్చి సైన్యంబునం
గూడం బెట్టెదు నీవు పాండుసుతులం గుందింపఁగా, సత్యముం
బాడిం దప్ప, లోకప్రవాదం గీర్తియు, బాంధుత్వ మే లొల్లవో. 289

ఉ. వారును మీరుఁ బొందిది జనవల్లభు లెల్లను భృత్యభావనం
జేర సమస్తవస్తువులుఁ జేకుఱఁగా బ్రతుకొప్ప గాక, నీ
కీరస మెత్తికోల్ గలిపి యుద్ధము కార్యము దప్పఁ జూచుని
వారలు, ముట్టవచ్చిన సపత్నుల నంతకుఁ జాలరుం జుమీ. 290

ఆ. వీరకారు పాండవేయులఁ బోరి మా
ర్కొన సురాసురులకుఁ గొలఁది గాదు
గాన వారితోడి కయ్యంబునకు నిర్ణ
యింప వలదు సంధిపెంపుఁ జేయు. 291

క. ఈయున్న రాజు లందఱు
వాయుసుతున కొక్కయెత్తు, వాఁ డలిగిన శూ
లాయుధుఁడు నడఁకు. నా కొం
తేయులతోఁ బోరుచను టుడుగు ధీరవిచారా. 292

క. ఒక కార్యము సెప్పెద మీ
సకల బలమునందు సవ్యసాచి కెదురుగా
నొకరుఁడు గలిగినఁ గయ్యము
నకు బూనుఁడు రిత్త బహుజనక్షయ మేలా. 293

క. పెక్కండ్రు గోవులం గొని
యుక్కు మిగిలి నడవ వెనుక నుద్దవిడిం దా
నొక్కఁడ నరుఁ డేతెంచినఁ
జిక్కె సమస్తంబు నది ప్రసిద్ధము కాదే. 294

క. తోడుదొన లేని యప్పటి
క్రీడికొలఁది యట్టి దధిప కినియక విను మేఁ
దోడ్పై రా నెదురుట గడుఁ
గీడు వలవ దుడుగవయ్య గెలు వరిది సుమీ 295

తే. అనుజ తనుజులఁ జెలులు వియ్యములు నడుగు
మాలిపోదురు నీకుఁ గా మనుజనాథ
దొరకుఁ గులనాశనం బను దూఱు మేలె
పాండవులతోడ నోడఁగూడి బ్రతుకనయ్య. 296

ఉ. రాజ్యము భారకోల్ల ధృతరాష్ట్రనియంప వెలుంగుచుండఁ ద
త్సామ్రాజ్యకుమారపట్టమునఁ బొల్చి చరింపఁగ నీవు పాండవుల్
సజ్యతఁ దంత్రించి త్తము ప్రసన్నతఁ బొందఁగఁ గొల్చి యుక్కి సా
మ్రాజ్యముగాఁ దలంతు రనుర క్తమతిం దమకున్ ధరాధిపా. 297

క. కౌరవనాయక పాండుకు
మారులు నీతోడిపొత్తు మపియెన మనఁగా
శ్రీ రా మోఁకా లొడ్డిన
వారివిధము కాదె నీవు వల దను టెల్లన్. 298

భీష్మద్రోణులు దుర్యోధనునకు హితంబు సెప్పుట.

చ. అన విని భీష్ముఁ డిట్లనియె నాధృతరాష్ట్రతనూజుతోడ నీ
జనకునిమాట వట్టుము ప్రసన్నమతిన్ మనవంశ మెల్లఁ బా
వనముగ నిందు వచ్చి బుధవత్సలుఁ డీహరి యిట్లు సెప్పఁగా
వినమిఁ గడుం జెనుట దెరువు వీరలపం పొనరింపు పెంపుగన్. 299

క. మానక ధృతరాష్ట్రుఁడు ప్రా
జ్ఞానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము సుద్దామయ
శోనాశముఁ జేయ నేల చూచెదు చెపుమా. 300

వ. కృష్ణార్జునులతోడివిరోధం బీబంధులోకంబునకె కాదు లోకంబున
నెవ్వరికిని జూడం బోలదు లోకంబులు రెంటికిని హానిం జేయక
కూడి బ్రదుకుట మే లనినఁ దదనంతరంబ ద్రోణాచార్యుండు
దుర్యోధనున కిట్లనియె. 301

తే. పితృపితామహగురుల మై ప్రీతిఁ గోరు
చున్న యట్టిపరమహితోపదేశ

వాక్యములు విని దుర్జనవచనరచనఁ
గొనక బంధులతో నొడఁగూడి మనుము. 302

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పినసపిస్తరవాక్ప్రచయంబులొప్పవఁ బో
వన్న కుమార యట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు మా
కన్నులు చల్లగా నకట గిన్కను చుండుదు మేము నట్లు గా
కున్నను నీవ చెర్చు నిను నొం డన నేరము నిందుకొల్వునన్. 303

చ. అనవుడు నాంబికేయుఁడు నిజాత్మజుదిక్కు మొగంబు సేసి యి
ట్లను హరి నాశ్రయించి భవదగ్రజుఁ బుణ్యు నజాతశత్రునిం
గను మట వాయి దీన మనకార్యము లన్నియు సిద్ధిఁ బొందు నీ
తనిపలు కాదరింపమిఁ బదంపడి పాటిలు నెల్లచేటులున్. 304

వ. అనియె నట్టియెడ గురుభీష్ములొత్తి చెప్పం దలంచి గాంధారేయున
కి ట్లనిరి. 305

క. శ్రీకృష్ణునిసారథ్యము
నాకృష్ణునిగాండివంబు నైతోఁపక ము
న్నీకొలఁదిఁ జక్కఁబడి నీ
వీకురువంశంబు గావు మిభపురనాథా. 306

వ. అని పలికి మఱియు. 307

సీ. ధర్మపుత్త్రునిపదద్వయమున కతిభక్తి
నెఱఁగిన నతఁడు ని న్నెత్తి గ్రుచ్చి
నిడుఁగేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌగిలిం
పఁగ భీముఁడును నీవుఁ బరమహర్ష
మునఁ జారుతరవక్షములు సంగతములుగాఁ
బరిరంభణం బొనర్పంగ నరుఁడుఁ
గవలును మ్రొక్కినఁ గర మర్థిఁ దిగిచి నీ
వాలింగనంబు సేయంగ నిట్లు

తే. వారును మీరును దగ బాంధవమునఁ బొదలి
యుంపు దళుకొత్తఁ దామరతంపరైనఁ

జెలులుఁ జుట్టలుఁ గలిసి పేరెలమిఁ బొంది
యుల్లసిల్లంగఁ గుల మెంత యొప్పునొక్కొ. 308

క. సమరమునకు వచ్చినభూ
రమణు లుభయకటకములను బ్రమదం బెసఁగం
దమతమపురములకుం బో
వ మహీజను లెట్టియుత్సవముఁ బొందుదురో. 309

వ. అని వెండియు ననేకవిధంబులం జెప్పి యీరెండుదెఱంగులవారును బంచి కుడిచి సుఖం బున్న నఖిలభూపతులకును బ్రమోదం బగుం గావున నట్లు సేసి యందఱచేత దీవనలు వడయవయ్య నీ వనిన విని దుర్యోధనుం డప్పుండరీకాక్షు వీక్షించి యి ట్లనియె. 310

క. గురుఁడును బితామహుఁడు నీ
నరనాథుఁడు నెల్ల ప్రొద్దు నను దూఱుదు రి
ప్పురుసున నీవును దామో
దర దూఱెదు గాని తగవుఁ దలఁపవు కంటే. 311

క. వనితం బఱచి, రరణ్యం
బున నియమలఁ బడితి మనుచుఁ బోటరులై చం
పను జెఱుపఁ దలఁచి మూఁదెసఁ
గనలుదు రప్పాండుసుతు లకారణము కడున్. 312

మ. అరయం దప్పొకయింత నావలన లే దాధర్మపుత్త్రుండు జూ
దరివెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ము
ష్కరుఁడై వెండియు నోడ్డఁగా నతఁడు నక్షప్రౌఢిమై గెల్చె నే
తెరు వైనం దనయిచ్చ తోఁ బడియె నిం తే కాక యేఁ బూఁటయే.

తే. మాత్స్యపాంచాలపాండ్యాదిమనుజపతులఁ
గూర్చికొని తార కయ్యంబు గోరి యెత్తి
విడిసి రింతియ కాక యివ్విధము నుగ్ర
కర్మమున కేము దొడఁగుట గలదె చెపుమ. 314

క. ఉక్కఱి సురపతి సైనను
మ్రొక్కము నృపధర్మమూఁది మొనతలఁ బడినన్

మిక్కిలి పేరును నిట దివి
నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట నుపేంద్రా. 315

చ. చిఱుతదనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక ముం
దఱ యటు వోవ నిచ్చితిఁ బితామహుఁడున్ జనకుండు నింకఁ గ్ర
చ్చఱ నిలఁ బంచి చక్కసగ మక్కడ నెవ్వరికేని మద్భుజం
బెఱుఁగక యీఁ దలంచినను నే నది యేటికి సమ్మతించెదన్. 316

తే. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి పాండు
సుతులు రాజ్యంబు సేయంగఁ జూచు కలుచ
నాకు నీ దీఱునే యింక నాఁటిచూఱ
లెక్కడివి ద్రోణభీష్మ లీదిక్కు సుమ్ము. 317

ఉ. ఏమును వారు బంచికొని యేలుట గల్గదు పల్కు కుంఠు మిం
కేమియు వాఁడిసూదిమొన యించుక మోపినయంతమాత్రయుక్
భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్

తే. అనిన విని కిన్కఁ బూనినయలఁతినగవు
చెలువు మొగమున కొకక్రొత్త పోలు పొనర్పఁ
బుండరీకాక్షుఁ డగు తెల్లఁ బోయి యప్పు
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు 319

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో మున్నుతండ్రు సేసినదుర్ణయంబు సెప్పుట.

క. మొనతలఁ బడియెదు నీచె
ప్పినయట్టుల తడవు లేదు బిరుదుల రైన నీ
వును వీరు నిలువుఁ డిదె భం
డన మొల్లియ వచ్చె నూఱటలు గనుఁ డింకన్. 320

సీ. అరయంగఁ దప్పు లే దంటి నీవలనఁ గీ
డొకనాఁడు సేసియు నొక్కనాఁడు
సేయవె నీజనించినయది యాదిగా
నుడుగక పాండవేయులకుఁ జాల
నగ్గు సేసితి విష మిడి పెనుఁబాములఁ
గఱపించి నీరిలోఁ గట్టి త్రోచి

లక్కయిల్ గాలిచి పెక్కుభంగులఁ జంపఁ
దలఁచితిఁ గావె ధర్మరక్షఁ

ఆ. జేసి నెగడు రాచసిరి నొందియున్నఁ జూ
పోప కీవు తీవ్ర పాపబుద్ధిఁ
గనలి జూద మొకటి కల్పించి కపటంబు
సేయ బూనినట్లు సేయఁ బుట్టె. 321

తే. అన్నదమ్ముల సత్తంబు లౌని సతుల
తలలు పట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టివారి నెందుఁ
దడవుమా నీ వొకండవు దక్క నధిప. 322

ఉ. అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడినమాటలు గొల్వులోపలం
జెప్పెడునట్టివే కులము శీలము గల్గిన పుణ్యకాంత క
ట్లొప్పమి సేయు టెల్లఁ గని యున్నజనంబులు వించు నుండఁగాఁ
ద ప్పొకయింత లేదనువిధం బది నీకు చనుం గుమారకా. 323

తే. ఎత్తి విడిచినవా రని యెల్లతప్పుఁ
బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకు గలదె
ద్రోణభీష్ములుఁ దండ్రియు ద్రోహుఁ డోడఁ
జెప్పతగుమాట లేమియుఁ జెప్పఁ బోరవు. 324

క. శాంతిం బొందుట నీకుం
గుంతీపుత్త్రులకు మే లగుం దానికి నే
నింతయు నాడెద నది నీ
కెంతయు రుచియింప కునికి యెఱిఁగి యెఱిఁగియున్. 325

వ అని యిట్లు నారాయణుండు నానాప్రకారంబులం జెప్పుటకుఁ గట
కటంబడి యెడ దుర్యోధనునకు దుశ్శాసనుం డిట్లనియె. 326

మ. జనకుండుం గురుభీష్ములుం దగినకర్ణం బాప్తులై నీకుఁ బ్రీ
తి నెఱింగించు తెఱంగుగాదు తమబుద్ధిం బోయి సంధాన మి
ట్లొనరం జేయుక యున్నఁ గృష్ణునకు నిన్నొప్పించువా రింతవ
ట్టు నిజం బిచ్చుట నింక నీయునికి నెట్లుం గీడు పుట్టుం జుమీ 327

ఆ. అనిన బాహ్లికాదు లగుకురువృద్ధుల
నాత్మ జనకుఁ గృష్ణు నాదరింప
కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన
లేచి పోయె సంచలించెఁ గొలువు 328

తే. అతనివెనుకన కర్ణుండు ననుజగణము
శకునియును వారిపొందైన జనపతులును
బోయి రమ్ముఖ్యుఁ జని యొక్కప్రోవు గట్టి
వేఱ యంతంత నుండిరి గోరడమున. 329

వ. ఇట్లున్నం గనుంగొని గాంగేయుం డను. 330

చ. ఇతఁ డిది యేల క్రొవ్వి ధరణీశుఁడ నంచు వృథాభిమాని యై
మతి సెడి లోభమోహమదమత్సరముల్ దనుఁ ద్రిప్ప నిట్లు సం
గతమునఁ బోయె వీనివెనుకం జని రేమి దలంచియో మహీ
పతులును వీరు గొంద ఱతిభారపుమానుసు లేమి సేయుదున్. 331

తే. అని జనార్దనుఁ గనుఁగొని యకట కాల
పక్వ మయ్యె నీధరపతిప్రతతి యెల్ల
ననుడుఁ దగువారిదెసఁ గలయంగఁ జూచి
తగవుమొయి నిట్టు లనియె నన్నగధరుండు. 332

శా. ఈదుర్యోధనుఁ డింతగర్వి యగునే యీయున్నవా రెల్ల నా
చే దైన్యంబునఁ బొందు టొప్పదని చర్చింపండ యీభంగికిన్
లేదే యొండుదెఱంగు సత్కులముఁ బాలింపంగ వర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ బోదే ఖేద మీజాతికిన్. 333

ఉ. కంసుఁడు నిట్ల తండ్రిమది గందెడుచంద మొనర్చి ధర్మవి
ధ్వంసము సేసినం గులమువారలు నాకెఱిఁగింప నేను దు
ర్మాంసము గోయువైద్యునిక్రమంబున నాతనిఁ ద్రుంచి యన్వవా
త్రంసముఁ జేయనే జనకుఁ దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్. 334

ఆ. అంతతోడ నెల్లయాపదలును దీఱు
వంశ మధికగౌరవంబు నొందుఁ

గూడి మనుట గలుగుఁ గురుపాండవులకు ని
త్తెఱఁగుసూడ మీఁకు నుఱవ కాదె. 335

వ. అనిన విని ధృతరాష్ట్రుం డుపరిపఁ విదురున కిట్లనియె. 336

ఆ. బుద్ధిమంతురాలు పొందుగఁ బలుకంగఁ
నేర్చు వచ్చు కొడుకుఁ దేర్చి పోవఁ
దాన వేగ నీవు గాంధారిఁ దోడ్తె
మ్మనుడు నరిగి యతఁడు నట్ల చేసె. 337

వ. అద్దేవియు 338

క. చనుదెంచి యుచితపీఠం
బున నున్నం గురువిభుండు పొలఁతుకతో ని
ట్లను నీ తనూభవుఁడు దు
ర్వినయంబునఁ జనియె నిట్టి వెంగలి గలఁడే. 339

క. నీవైనఁ జెప్పి శాంతుం
గావింపఁగ నోపుదేనిఁ గౌరవకుల మీ
గోవిందుశాసనము సం
భావింపం గాంచి, చెడక బ్రతుకుం జుమ్మీ. 340

తే. అనుడు నీపుత్త్రుఁ డవినీతుఁ డగుట యెఱిఁగి
యెఱిఁగి వాని వశంబున నేలపోయె
దీవు పాండవులకు నేమి యిచ్చితేని
నడ్డపడ నెవ్వరికి వచ్చు నధిప చెపుమ. 341

క. అని గాంధారి పతియుఁ దా
నును విదురుం బనిచె నందనుం బిలువ నతం
డును మొగము జేవురింపఁగఁ,
జనుదెంచెను సభకు విదురసంప్రార్థితుఁడై. 242

వ. మున్ను దనతోడం జనినవార లందఱు నచ్చోటన నిలువ నిట్లు వచ్చి సుయోధనుండు నిజాసనాసీనుండై యున్నఁ జూచి తల్లి చిత్తంబున గర్హించుచు నతనికి ధర్మంబును నీతియును జుట్టఱికంబును బ్రదుకుఁదెరువును నిజశక్తియు సహాయంబు గొలందియుఁ గులజన

చిత్తప్రకారంబును బాండుపుత్త్రుల బలపరాక్రమంబులుఁ దెలియు
నట్లుగాఁ దెలుంగుపడఁ జెప్పి బుజ్జగించియుఁ గినిసియు ననేకవిధం
బుల నాడిన సమ్మాటలదెస ననాదరంబు సేసి యుద్ధతిం గ్రమ్మఱం
జని యతండు కర్ణాదులం గలసి వారునుం దానును దుర్మంత్త్రంబు
నకుం జొచ్చెఁ 343

దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱంబెట్టఁ దలంచుట.

క. హరితలఁ బొప్పదు భీష్ముని
గురునిం గూర్చికొని మనలఁ గ్రొవ్వఱఁ బట్టం
గర ముత్సహించు చున్నాఁ
డరయ నతని వచనరచన నంతయుఁ దెలిసెన్. 344

క. మును దాఁ గంసునిఁ బరిమా
ర్చిన చందము వారికెల్లఁ జెప్పెడుఁ దనకున్
మును మనము గడఁగి వెసఁ బ
ట్టినఁ గార్యంబగుఁ జలంబు డింపకుఁ డింకన్. 345

తే. పట్టి యాతనిఁ జెఱఁబెట్టి పాండవులకు
దిగులు పుట్టింత మంతటఁ దెగక యెత్తి
వచ్చి రేనియు నిర్జింపవచ్చుఁ గోఱ
లెల్లఁ బుచ్చిన నురగంబు లేమి సేయు. 346

వ. అని విచారించె నిట్లు దుష్కార్యాలోచనంబు సేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులను దుష్టచతుష్టయంబు మొదలుగాఁ గల యవినీతులు దైతేయమర్దను మర్దింప నిశ్చయించి రయ్యవసరంబున. 348

చ. అడఁకువ లేమి, నల్క యురియాడుట, నొండొరుఁ గూడకుండుటన్
బుడిబుడి మాటలాడుటను, బోవుచు వచ్చుచుఁ గ్రిందు గ్రమ్మఱం
బడుటను, దెల్లమైన మును పన్నుగఁ దాఁ బరికించి యున్కి న
ప్పుడు హరిఁ బట్టుసంకులము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్. 348

తే. బయటి కొనిపోయి కృతవర్మఁ బన్నఁ బనిచె
నీవు బలమును వాకిట నిలుపు మేను

లోపలికి నెల్లఁ జాలుదుఁ బాపబుద్ధు
లన్న దెసఁ దప్పి రని నిర్భయముగఁ జెప్పె. 349

వ. ఇట్లు పరమాప్తుం డగు హార్దిక్యు నట పుచ్చి సాత్యకి సత్వరంబుగాఁ జనుదెంచి జనార్దనునకు నత్తెఱం గెల్ల నెఱింగించి తదనుమతిం గౌరవేశ్వరబాహ్లికభీష్మ విదురులతో నిట్లనియె. 350

మ. అదె కౌరవ్యు లశక్తపూర్వత సేయంబూని పైఁ బోఁటిఁ జూ
చెద రిమ్మైత్రి గమచేతఁ దీఱునె జయశ్రీకాంతు దైత్యాంతకుం
బాదువం దారు దలంచు టెల్ల ననలంబుం జీర బంధింపఁగా
మది నూహించిన యట్ల కాక తమ దుర్మంత్రంబులం బోవునే. 351

వ. అనిన విదురుం డపరిషక వైచిత్రవీర్యున కిట్లనియె. 352

ఉ. భూవర నీ తనూభవులు పుణ్యు సగణ్యపరాక్రము హరిం
గేవల మర్త్యుఁగాఁ దలఁచి కిట్టినఁ బట్టిన దారు మంటపై
వాపిరిఁ గ్రమ్ము నా శలభవర్గముచాడ్పున మ్రింది పోరె కా
లావధి యయ్యెఁ గావలయు నక్కట వారికి వారివారికిన్. 353

వ. అనుటయు గోవిందుం డందఱు విన సంబికానందనున కిట్లనియె. 354

ఉ. రోషముగు నాపయిం గలిగి క్రూరతఁ గౌరవు లింత సేఁత సం
తోషము నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము ని
ర్దోషత నేను నోపుగతి దోర్బలదుర్జయు లైనవారి వి
ద్వేషముఁ జక్కఁబెట్టి జగతీవర యంతక పోయివచ్చెదన్. 355

క. అనుడు ససంభ్రమముగ న
జ్జనపతి దుశ్శాసనాది సకలపరిజనం
బును నా దుర్జనునిం దో
డ్కొని రమ్మని విదురుఁ బనుచుడుం జని యతఁడున్. 356

వ. సపరివారంబుగా దుర్యోధనుం దోడ్తెచ్చినం జూచి యతనికి ధృతరాష్ట్రుం డిట్లనియె. 357

చ. అలవి యెఱుంగ కిట్లు దనుజారికిఁ గీఁడొనరింప నీవు నీ
తులువలు నుత్సహించితిరి దుర్మతులార సమీరు మీకుఁ బోఁ

కలవడి పట్టవచ్చునె మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా
నలు జమరంగ శక్యమె వినాశముఁ బొందెద రేమి సేయుదున్. 358

ఆ. అనిన విదురుఁ డిట్టులను సుయోధనుతోడ
బాలకేళిఁ దొడఁగి లీలఁ గృష్ణుఁ
డెచట నెచట నెవ్వరెవ్వరి నేమేమి
సేసె వినవె యేల చెడియె దిట్టు. 359

వ. అనియె నట్టియెడఁ గట్టెదుర నున్న యక్కురుపతికుమారుం జక్కం జూచి యే నొక్కరుండన యని తలంచియె దుర్మదంబునం బొదివి పట్ట నుత్సాహంబు సేసి తనుచు దరహాసంబు సేయు వాసుదేవుని ఫాలప్రదేశంబున బ్రహ్మయు వక్షంబున విరూపాక్షుండును వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్ర యమ వరుణ కుబేరులు నాదిత్యమరుద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి హలగాండీవమండిత బాహు లగుబలదేవార్జునులు సవ్యదక్షిణభుజంబులను నిజాయుధహస్తు లగు యుధిష్ఠిరభీమనకులసహదేవులు వీఁపునను వివిధప్రహరణపాణులగుయదువృష్ణి భోజాంధకవీరు లూరులను బ్రభవించిరి జనితనానాహస్తవిన్యస్తంబులయి శంఖ చక్రగదాఖడ్గ శక్తిశార్ఙ్గ ప్రముఖనిఖిలసాధనంబులు వెలింగె నేత్రశ్రోత్రనాసా వివరంబుల సధూమధూమకేతుజ్వాలాజాలంబులు నిగిడె రోమకూపకలాపంబులం దరణికిరణనిభప్రభలు వెడలె నిట్లుదుర్నిరీక్ష్యం బగు నత్తెజోరూపంబుఁ గనుంగొనంగొలఁదిగాక సకలజనంబులు నయనంబులు మొగిడ్చి యద్భుతభయానకరసంబుల జొత్తిల్లు చిత్తంబులతోడం గదల కుండ నప్పుండరీకాక్షుండు నారదాది మహామునులవలనను భీష్మవిదురద్రోణసంజయులయందునుగరుణాతరంగితం బగు కటాక్షవీక్షణం బొలయ వారలకు దివ్యదృష్టి యొసంగిన నాపుణ్యాపురుషులు సాంద్రానందంబునం దేలుచుండిరయ్యవసరంబున. 360

తే. దేవదుందుభివ్రాతంబు దివి రేఁగల్ప
వృక్షపుష్పధారామయవృష్టి గురిసె

సిద్ధసాధ్యవిద్యాధరశ్రేణి భక్తి
నిచ్చుజయజయశబ్దంబు లెసఁగెఁ జదల. 361

వ. అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు విష్ణుని దివ్యవిజృంభణంబు గావలయునని యూహించి. 462

క. కరుణింపుము సంశ్రితభయ
హరణధురీణా సహింపు మజ్ఞానంబుం
శరణంబు వేఁడెద భవ
చ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే. 263

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగునప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టి య
జ్జనపతి కద్భుతం బెసర నమ్మనపూరము గ్రమ్మ నాతఁడుం
గనుఁగొని భక్తి మ్రొక్కి నినుఁ గంటిఁ గృతార్థుఁడ నైతి నింక నొ
ల్ల నొరులఁ జూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే. 364

క. అనినపలుకులకు నచ్చటి
జను లెల్ల నృపాలు సితవిశాలాక్షుఁ గనుం
గొను చుండి రపుడు దమనె
మ్మనమ్ము లాశ్చర్యరసనిమగ్నంబులు గాన్. 365

వ. తదనంతరంబ దామోదరుండు ధృతరాష్ట్రు నభిమతంబు బొడఁగూడ నతని కన్ను లెప్పటియట్ల కావించి నిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి మునీంద్రులనామంత్రణంబు సేయ నమ్మహాత్ము లంతర్ధానంబు సేసిరి దానును సముత్థానంబు సేసి యంతకు మున్న సన్నిహితులై యున్నకృతవర్మకరంబును సాత్యకి హస్తంబును నవలంబించి యూరక ..............................
వెడలిన విస్మితయై గాంధారి యభ్యంతర మందిరంబున కరుగం గౌరవు లెల్లను బంధుమిత్రసహాయసహితంబుగాఁ దనతోడన వెడల మొగంబు గంటు వెట్టికొని కక్ష్యాంతరంబులు గడచినప్పుడు దారుకుండు తేరినాగలపై నుండి పాదసూపికేలు మొగిచ్చి ఫాల భాగంబునం గదియించినం దత్ప్రదేశంబున నిలిచి వారల వెన మరలి చూచి మీ రింక నిలువుం డని పలికిన నాంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి. 366

ఉ. వీరును బాండుపుత్త్రులును వైరము దక్కి పొసంగి మన్కికై
పోరిత మాఙి, యే నటులు బుద్ధులు సెప్పినభంగియుం గులా
చారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁ గాదె గదాధర నీకుసన్నిధిన్. 367

వ. అని వెండియు. 368

తే. నీకు శుద్ధుండ నగుటయు నిఖిలబంధు
మిత్రగురుజనకోటికి ధాత్రి కెల్ల
నంబుజాక్ష నిర్దోషుండ నగుట గాన
నా తెఱంగు నీ వెఱుఁగుట నాకుఁ జాలు. 369

వ. అనిన విని యచ్యుతుండు బాహ్లికభీష్మద్రోణకృపప్రముఖనిఖిల
విశిష్టజనంబుల నాలోకించి 370

తే. ఇప్పు డీసభఁ బుట్టినయింతవట్టు
మీకుఁ దెల్లంబు గాదె యీమేదినీవి
భుండు దా నేమిటికిని ముఖ్యుండఁ గాను
దప్పు దనదెస లే దని చెప్పి పిడిచె. 371

వ. కావున నాకు నియ్యెడం దడయం బని లేదు పోయి వచ్చెద ధర్మ
పుత్త్రునకు నింత వృత్తాంతం బెఱింగింప వలయు నని పలికి
వారల నామంత్రణంబు సేసినవాఁడై రథారోహణంబు సేసి ధృత
రాష్ట్రుండును నచటిజనంబులును వెనుకం జనఁజని కుంతీగృహ
ద్వారంబున నరదంబు డిగ్గి. 372

క. వారందఱుఁ దనతోడన
గౌరవమున నరుగుదేరఁ గాఁ జొచ్చి మహో
దారుఁడు గుంతీచరణాం
భోరుహముల కెఱఁగి వినయభూషణుఁ డగుచున్. 373

క. కౌరవసభఁ దా నాడిన
గౌరవవాక్యములఁ గార్యఖడ్గకక్రమవా

ర్భావములు సుయోధను దు
ష్ప్రారంభము సల్పవచనపద్ధతిఁ జెప్పెన్. 374

వ. ఇట్లు ధృతరాష్ట్రుకొలువునం బుట్టినవిశేషంబులు పాండురాజమహిషి కెఱింగించి మాధవుండు మఱియును. 375

తే. కురుకుమారులు దమయంతఁ గుడిచికొనివ్వ
మీఁదెఱుంగరు మాకేమిమేలకాక
నాలుకలుగోయు నర్జునానలసు దరిసి
యెర గొనంగని సంతృప్తి యొసఁగ మెసఁగు. 376

వ. పాండుకుమారులపాలికిం బోయి వచ్చెద వారికిం దగినబుద్ధులానతిమ్మనిన నద్దేవి యెల్లవారును విను చుండ వెండియు నిట్లనియె. 377

ఉ. రాజుల కెందు నారయఁ బరాక్రమజీవనవృత్తి దక్క నొం
డోజ నిషిద్ధ మండ్రు మును; ఉత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు, బుద్ధివిహీనులు వానిఁ దక్కి ని
స్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా. 378

క. నీ వియ్యంబులు సంధియ
కావింపం బసిరి వీరిఁ గలయుట కష్టం
బావెరవు దప్పాటయు మే
లై వచ్చెం బొమ్ము, వినువు మనుమానంబున్. 379

మ. నిజవంశోచిత వీరవృత్తమున కున్మేషంబుగా నాకపి
ధ్వజుఁ డుత్సాహము సేయ కున్న నకటా దైన్యంబు వాటిల్లదే
భుజదర్పోద్ధతుఁ డైనభీమునకు నీపాం దొప్పునే నీవు స
ర్వజగన్మాన్యుఁడ వెందు రాఁ దగునె దైవం బిట్లు దప్పించునే. 380

వ. అని యంత నిలువక గొంతి యిట్లనియె. 381

క. మఱచిరె కొలువున ద్రౌపదిఁ
బఱచినబన్నంబు ధర్మపథము దొఱంగన్
వెఱచుట కప్పటి కది దగుఁ
జెఱచినచో వెదక వలదె చిరతరకీర్తిన్. 382

శ్రీకృష్ణుఁడు కర్ణునిఁ దనరథం బెక్కించుకొని కొన్నిరహస్యోక్తులు వలుకుట

వ. అని పలికి పుండరీకాక్షుం గౌఁగిలించికొని యచ్యుతుండు మ్రొక్కిన
దీవించి యేను సుఖం బున్నదాన నని పాండవులకుం జెప్పుము చేతు
లలావునం గనిన జీవనంబున బ్రతుకుదుం దనుము పోయి రమ్మని
వీడుకొల్పిన సింహగమనసుందరంబుగా వెడలి తనతోడన గదలి
వచ్చినధృతరాష్ట్రాదుల నిలువం బనిచి రథారోహణంబు సేసి
గోవిందుండు కర్ణుదెసం గనుంగొని న న్ననిచి వత్తు గాని రమ్మని
కరంబు సాఁచి చెయి వట్టి తన యరదం బెక్కించుకొని సాత్యకి
వేసరి నెక్కి కెలనం జనుదేరం గదలి చని యనుపవచ్చిన కృత
వర్మ నుచితప్రకారంబున సస్నేహంబుగా నిలిపి యరుగు నవస
రంబునఁ బౌరలోకంబు. 383

ఉ. అక్కట వాసుదేవు పను పాదరణంబునఁ జేయరైరి వీ
రెక్కడి బుద్ధిమంతు లని నిందును నందును లోకమెల్లఁ బే
రుక్కున మ్రగ్గుటం దలఁప నొల్ల కపాయము సేసి రట్టె యీ
యుక్కివు లెందునుం గలరె యొప్పరు వో ధృతరాష్ట్రనందనుల్.

వ. అనియు మరియు ననేకు లనేకప్రకారంబులఁ బలుకుచు నిరుగెలం
కులం జూచుచుండఁ బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె నిట
ధృతరాష్ట్రుండును మగిడి కొలువుకూటంబునకు వచ్చె నెప్పటి
వారలు పరివేష్టింప నుండి కృష్ణునివలని మాటాడుచున్న సమయం
బున సుయోధనుతో భీష్మద్రోణు లిట్లనిరి. 385

చ. పలుకునె యిట్లు గొంతి, విని బమ్మెరపోయితి, మింత బెట్టిదం
బులగునె మాట లయ్యమయుఁబుణ్యుఁడు కృష్ణుఁడు గార్యవాదముల్
వలికెనువార, లిట్లు దెగఁ బాటిరి, ధర్మజవారిరాశికిం
జెలియలికట్ట వాసె మనచే నగు కర్జముచంద మెట్టిదో. 386

వ. అని పలికి వెండియు. 387

శా. మాకుం జూడఁగఁ బోలు కార్య మిది ధర్మప్రీతి నీ వేఁగి సు
శ్లోకుం డైన యుధిష్ఠిరుం గని జనస్తుత్యంబుగా శాంతిమై

నీ కౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యే పొప్పు దెందుం మదిన్
శోకం బొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁ బోవే నృపా. 388

వ. అనిన విని దుర్యోధనుండు మొగంబు రాజుచుండ నూరకుండె
గాంగేయుండును గురుండును డిగ్గన లేచి యతని నవలోకించి. 389

క. కురునృప విను సంసారము
దరిద్రొక్కిన వార మింకఁ దలఁకెదమే సం
గరమునకు నేము నీకై
పొరలితి, మెల్లైన నగును బోయెద మనుచున్. 390

క. అరిగిరి రాజును సభ్యం
తరమునకుం జనియె రాజతనయుండు బహిః
పరివారముఁ బొమ్మని మిత
పరిజనుఁడై యేఁగె నాత్మభవనంబునకున్. 391

తే. అంత నక్కడ నచ్యుతుఁ డరిగి యరిగి
యధికసంప్రీతి దలకొన నర్కతనయు
నాననంబు వీక్షించి యిట్లనియె నెమ్మి
నన్యు లెవ్వరు వినకుండ నతనితోడ. 392

సీ. నీవు వృద్ధజనోపసేవివి ధర్మసం
వేదివి తెలియంగ వినుము సిద్ధ
మంత్రబలంబున మార్తాండు వరమునఁ
గన్నియతరి గొంతి గన్నవాఁడ
వగుటఁ బాండునృపాలు నగ్రసుతుండవు
ధర్మమార్గం బిది ధర్మతనయుఁ
డాదిగాఁ గల తమ్ములందరు నాచేత
నెరిఁగి నీ యనుగుల కెరఁగి సకల

ఆ. పుత్రమిత్రబంధు భూరిసేనాసమ
న్వితము గాఁగ గొలిచి నిన్ను రాజ్య
భారవహనమునకుఁ బట్టంబు గట్ట ను
జ్జ్వలుఁడ వగుదు రమ్ము వారికడకు. 393

వ. ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు నీవు దొలుత వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు నీ రథంబున నుండి నీకు ధవళచామరంబులు వైచు వాయుపుత్త్రుండు సితచ్ఛత్త్రంబు వట్టు సవ్యసాచి సారథ్యంబు సేయు మఱియుఁ బాంచాలయాదవపాండవామాత్త్యులు లోనుఁగా గల రాజలోకంబుతోడఁ గవలు నభిమన్యుప్రభృతికుమారులు వెరయ నేమెల్లం బలసి పరివేష్టించి వత్తు మిట్టి మహేంద్రవిభవంబున మహనీయుండ వగుచు మహీచక్రం బేలుమని మరియును. 394

క. పాంచాలరాజపుత్త్రియు
నంచితముగ నిన్నుఁ బొందు నార్వురవరుసన్
సంచితపుణ్యుఁడ వీ వొక
యించుకయును వేరుసేయ కేతెమ్మెలమిన్. 395

వ. ఇట్లైనఁ గుంతికి సమస్తబంధుమిత్త్రులకుఁ బ్రియంబగు ననిన విని రహస్యంబుగా రాధేయుండు మాధవున కిట్లనియె. 396

కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగిన యుత్తరంబు లిచ్చుట.

చ. వెడవెడ యేనుఁ దొల్లి యిది వింటి ననుం గని కుంతి యొంతయుం
జెడ నది వైచి పోయెఁ గృపఁజేకొని సూతుఁడు దెచ్చి తానుమున్
కొడుకులు గాన కున్కిఁ బ్రియకుం దగ నిచ్చినఁ జేఁపెఁ జన్ను ల
ప్పడఁతియు నప్పు డాదిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రియత్నశీలయై. 397

క. మూత్త్రపురీషాదులు దమ
గాత్త్రములం దింక వారు గారవ మెసఁగం
బుత్త్రుం డని సంవర్ధిత
గాత్త్రునిగాఁ జేసి రింతకాలముఁ గూర్మిన్. 398

క. నేఁ డింక నెఱిఁగి యొరువుల
వాఁడఁ గదా యనుచు నేను వారిఁ దొఱఁగినం
బోఁడిమి చెడదే మదిఁ గడు
వాఁడిగలదె నీకు నకట వారిజనాభా. 399

వ. వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుం గలవాఁడ వని నన్ను నీవ చెప్పితివి రాధయు నధిరథుండును నాకు జాతకర్మాదిసమస్త సంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించి రట్టితల్లిదండ్రులకుఁ బుత్త్రకృత్యంబులు నిర్వర్తింపక వారలం బాసి యేను వచ్చుట ధర్మంబగునే యని పలికి వెండియు. 400

క. సోదరులుఁ బ్రియులు ననుజులు
నాదెసఁ జెక్కంద్రు వారి నందఱ విడువం
గా దని యూహింపక దా
మోదర నన్నిట్లు పిలుచు టుచితమె చెపుమా 401

వ. అదియునుం గాక. 402

ఉ. సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును బెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటిమానిసిఁ జేసి యుండ నే
నే తగ నూఁచి యాకురుకులేశ్వరుఁ బాయుదు ముట్టవచ్చినన్. 403

క. నను నయ్యర్జునునకు నెదు
రని పెద్దయు నమ్మి యుండు నక్కట దుర్యో
ధనుఁ డానమ్మిక వమ్ముగఁ
జనునే పాండవులఁ గలయఁ జన నా కనఘా. 404

ఆ. ఏను నర్జునుండు నెక్కటెక్కటి దల
పడక యున్న నగరె పుడమిజనము
లందు నాఁడువచ్చు టతనికి నపకీర్తి
యనిన నాకు వేఱె యడుగనేల. 405

క. హిత ముపదేశించితి నీ
వతి నిర్మలబుద్ధి వగుట నైనను నిది నా
మతి సొరదు రహస్యము ర
క్షితముగఁ బాటింపుమయ్య చిత్తములోనన్. 406

వ. అది యేమిటి కంటేని. 407

తే. ధర్మతనయుండు దానునాతమ్ముఁడగుట
యెఱిఁగెనేనియు సామ్రాజ్యమేలవూను
నట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధకెల్ల. 408

క. అనుజులు ఋత్విజులుగ నీ
పని యిటు సేయు మని నీ కృపద్రష్టవు గా
విను కురుకుమారపశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్. 409

వ. దానం బుణ్యభూమి యగుకురుక్షేత్రంబున మముబోంట్లలను సద్గతి
వడయుదురుగాక యనిన విని వసుదేవనందనుండు సూతనందనున
కిట్లనియె. 410

మ. దయ నాయాడినమాట గైకొనవు, సంతాపంబుఁ దెచ్చుంజుమీ
స్మయ మెట్లుం దుది, నీకు నర్జునునితో మాత్సర్య మైనం బరా
జయ మొండెన్ మృతి యొండెఁగాక గెలువన్ శక్యంబె, పెక్కండ్ర
కింతియకాలం బగునట్టి నీమనము శాంతిం బొందఁగా నేర్చువే.

క. గాండీవముఁ గవదోనలు న
ఖండితదివ్యాస్త్రములు నొగలపై నేనుం
జండ భుజబలము నైయు
ద్దండత నరుఁ డడర నెదురఁ దరమే నీకున్. 412

వ. ఎల్లభంగులం బాండవుల గెల్వరది యట్లుండె నీవు పొమ్మిప్పుడ
పోయి సుయోధనునకును గురుభీష్ములకును మీాకుం దోడు వచ్చిన
రాజుల కందఱకుం జెప్పు మిమ్మాసంబు సౌమ్యం బై శీతోష్ణం
బులు లేక పుష్పఫలోపేతంబును సమగ్ర ధాన్యంబును సులభయవ
సైంధవంబును నగుచు నొప్పియున్నయది యేడెనిమిది దివసంబులకు
నమావాస్య వచ్చు నది పుణ్యదినంబు నాఁడు భండనంబు గావ
లయు ననిన గానీ యుండు గమలనాభున కిట్లనియె.

క. కలవు నిమిత్తస్వప్నం
బులు గౌరవపాండవులకుఁ బోటగు దానన్
గెలు పయ్యుధిష్ఠిరునకును
గల దెఱుఁగుదు నీవు సెప్పఁగా నేమిటికిన్. 414

వ. అట్లు గాన కదా యే నందు రా నని పలికి మఱియును 415

క. దీనికి మూలము శకునియు
నేనును దుశ్శాసనుండు నింతియ కుంతీ
సూనుల వారలు గలసిన
రానేరఁగ వచ్చునాకు రాజీవాక్షా. 416

వ. ఈసమరసముద్రంబు దఱియ నీఁది నిన్నుం గనియెద గాదేని నూర్ధ్వలోకంబునం గాంచెద నీ వింక నేమియుం బలుకకుము పని వినియెద నని కౌఁగిలించుకొనిన నట్లు కాక పొమ్మని విష్ణుండు వీడుకొలుప రాధేయుండు రథావతరణంబు సేసి కనకరత్నమయం బగు తన యరదం బెక్కి కరిపురంబున కరిగె నచ్యుతుండును సాత్యకిం దనరథం బెక్కించుకొని దారుకుం జూచి పద పద పో నిమ్ము పోనిమ్మని పలికి లలితాటోపకలితుం డగుచుఁ జనియె 417

సమాప్తము

# టిప్పణము

1. దేవా = కృతికర్త అయిన తిక్కన కృతిభర్త అయిన హరిహర నాథుని సంబోధించుచున్నాడు. వైశంపాయనుడు = వ్యాస మహర్షి శిష్యుడు, జనమేజయుడు = అర్జునుని మునిమనుమడు. అర్జునుని కుమారుడు అభిమన్యుడు, వాని తనయుడు పరీక్షిత్తు, వాని పుత్రుడు జనమేజయుడు. తండ్రిని జంపిన తక్షకునిపై కసిచే జనమేజయుడు సర్పయాగము చేసి సర్పములను నాశనముజేయు చుండగా వ్యాసుడు వచ్చి శిష్యుడగు వైశంపాయనుని చే పాండవుల చరిత్రమును వానికి చెప్పించి సర్పయాగమును మాన్పింప ప్రయత్నించెను.

2. సంజయుడు = సూతపుత్రుడు (సూతులవృత్తి సారథ్యము) ఇతడు ధృతరాష్ట్రుని వెంటనుండి ఆ గుడ్డిరాజునకు సర్వ విషయములు చెప్పుచుండును. ధృతరాష్ట్రుడు పంపగా పాండవుల వద్దకు రాయ బారము వచ్చినవాడు, భృత్యవరులు = సేవకులలో ముఖ్యులు, దారలు = తమ్ము సేవించుచుండిన క్షత్రియులు.

3. జనార్దనుడు = కృష్ణుడు, పాలికి = వద్దకు, సంప్రీతి = స్నేహము, సుఖము.

4. బలసి = కలసి, చనుదేరన్ = రాగా, సత్కృతుండు = సమ్మానింప బడినవాడు, పరిజనములు = సేవకులు, పరివేష్టింపన్ = చుట్టు నుండగా, పార్శ్వమున = ప్రక్కన, పాంచాలి = ద్రౌపది. పంచాలదేశపు రాజగు ద్రుపదుని కూతురు, సముచిత, పరివార, పరివృత = తగిన సేవకులతో కూడినది, సుఖాసీనుండు = సుఖ ముగా కూర్చున్నవాడు.

5. కడవన్ + బెట్టగ = దాటించుటకు, ఓపి = శక్తికలిగి, ఒడ గూర్పన్ = కలిగించుటకు, క్ష్మాపాలుడు = రాజు.

6. నీకతంబునన్ = నీవలన, ఏము = మేము, (రూపాంతరము) అవి నీతుడు = నీతిదప్పినవాడు, సుయోధనుడు = దుర్యోధనుడు, తక్కి = మాని, అంశము = వంతు, ధరిత్రి = భూమి.

7. ప్రద్యుమ్నుడు = కృష్ణునికుమారుడు, దురితంబులు = పాపంబులు, పొరయకుండ = కలుగకుండ, అరసి = కనిపెట్టి, అనవుడు = అని చెప్పిన తరువాత; నీ, పంచిన, యట్ల = నీవు ఆజ్ఞాపించిన విధముగానే, అజాతశత్రుడు = ధర్మరాజు, కరినగరము = హాస్తినాపురము, తెఱంగు సేయవలయును = కార్యమును చక్కదిద్దవలయును, ఇయ్యకొలిపి = ఒప్పించి.

8. మా తండ్రి = పెదతండ్రి ధృతరాష్ట్రుడు, నందనుడు = పుత్రుడు, చందము = విధము, భంగి = విధము, పాలుపంపు = భాగము పంచి యిచ్చుట, ఈక =ఈయక, ఏలి మాటలన = కపటపు మాటలతోనే, అలుక = కోపము తారు = తాము (రూపాంతరము) సమయము = ప్రతిజ్ఞ, కులముపాడి = వంశమర్యాద, తలపడు + అ = తలపనే తలపడు; తలపడ (రూపాంతరము) పతి = వృద్ధ రాజు, చెడన్ + తలచెనేని = చెడిపోవ తలచినచో, వలచినట్టి వాడు = ప్రేమించినవాడు, వక్రత = వంకరబుద్ధి, ఎడరు = కష్టము.

9. జనని = తల్లి (కుంతి) నెమ్మిగ = ప్రీతితో, మననుట = బ్రతుకుట కును, తెఱగు + ఏది = పద్ధతిలేక (పద్ధతి తెలియక) ఉనికి = ఉండుట మా పౌరుషమే = మాకు పురుషోచితగుణమా ?

10. అచ్చెరువు + పడు = ఆశ్చర్యపడు, పొచ్చెము = మోసము, ఇంతవట్టు = ఇంతవరకు.

11. పెంపు + ఏదన్ = గొప్పదనము నశించగా, సిరి+నాకు+వేల+అందునే = రాజ్యలక్ష్మి నా కెందుకని యందునా ? గ్రాస + వాసః+దైన్యంబులు = కూడుగుడ్డ లేని స్థితి, నా + అరయు = నేను రక్షించు, మోదంబు + అందుట+కల్గు = సుఖపడగలము, పొంది = కలసి.

తాత్పర్యము :— ఆ దుర్యోధనుడు ఐదు గ్రామములనైన నిచ్చుటకు సిద్ధముగాని పక్షమున వానితో మేము యుద్ధమునైన చేయవలయును లేక సంపదనైనను వదలుకొనుటకు సిద్ధముగానుండవలసి యుండునుగదా! యుద్ధము మా గౌరవమునకు తగని క్రూర కర్మము. దానికి నే నొడబడను. దుర్యోధనుని దుర్మార్గత్వమునకు లోబడి గొప్పతనమును పోగొట్టుకొనుట నా కిష్టములేదు. నాకు రాజ్యమక్కర లేదా యంటు వేని నన్నాశ్రయించుకొన్న చుట్టములకు కూడు గుడ్డ లెట్లు వచ్చును? కాబట్టి మేమును కౌరవులును కలసి సంపదలను పొందినచో యుద్ధము తప్పును. అందరమును సుఖపడగలము.

12. లాంతులు = పరాయివారు, పగఱ = శత్రువులు (నిత్యబహువచనము) చంపన = చంపుటకు, సుహృత్ + జనము = స్నేహితులు గణుతింపక = లెక్కగొనక, దూఱు = నింద.

తాత్పర్యము :— పరాయిశత్రువులను మాత్రము చంపవలయుననే కోరిక ఏ మానవునికినీ ఎందుకు ఉండవలయును? వ్యవహారమును పరిష్కరించుకొనుటకు సంధియను వేరొక మార్గమున్నది గదా? అది యే లోకమువారు మెచ్చునది. కౌరవుల పక్షముననున్నవారు మన బంధువులు, స్నేహితులు. ఆవిషయమును లెక్కచేయక రాజ్యముకొరకు వారిని చంపినచో లోకములో నిందయేగాక పాపముగూడ సంభవించును. అట్టి వాటికి నొడిగట్టుకొనుట కష్టము.

13. పాండవ + అగ్రజుడు = పాండురాజు కుమారులలో మొదట పుట్టినవాడు. (ధర్మరాజు)

14. క్షత్రధర్మము = యుద్ధము, కష్టము = పాపము, పెఱధర్మము = మరియొక ధర్మము (అనగా యాచించుట) శస్త్రజీవిక + ఆ = ఆయుధములపై ఆధారపడి జీవించుటయే, తగియున్నదియైనన్ = తగియున్నను, అనభిక్షితము = పొగడబడునది కాదు.

15. కలహము + అగుటన్ = యుద్ధమువలన, లక్ష్మిన్ + కావించు = సంపదలను సమకూర్చును, ఓడి = భయపడి, ఓడిపోయి; పాఱుట =

పారిపోవుట, బల్లిదులు = బలవంతులు, అనద = (అనాథశబ్దమునకు తద్భవము) = బలహీనుడు, (బలహీనురాలు) చెడుట = నశించుట, ఘటించును = సంభవించును.

17. నిశ్చయమొక్కఁడు = ఏదో ఒక నిశ్చయము, హృదయపుటభేద నము = హృదయమునకు బాధకలుగ జేయునది. తథ్యము = నిజము

18. అవశ్యము = తప్పక, పెనకువ = యుద్ధము, కడతేర్చు = లేకుండా చేసికొను, ధృతి = ధైర్యము లేక సంతోషము. పూని = కలిగి డెందానన్ = మనస్సున

తాత్పర్యము :- కాబట్టి ఏవిధముగానైనను యుద్ధము కంటె ఇతరమైన యుపాయముచే వైరమును మాన్పుకొనుట నెరిగిననాడే సుఖముగా నుండును.

19. పగ + ఏ = వైరమే, ఊఱడిల్లి యుండు = శాంతముగానుండు, ఒక మాటు = కొంచెమునేపైనను, వలదు = తగదు.

20. లెస్స = మంచిది, పగ + పగ = పగవగగొన్న = పగవాడు శత్రుత్వము వహించినట్లయిన, మార్కొనక = యుద్ధము చేయక; కడున్ + తెగన్ = పూర్తిగా పోవునట్లు, మొదలు + ఎత్తి పోవన్ = దండెత్తగా, క్రౌర్యమొందును = (ఉభయపక్షముల వారిలోను) క్రూరభావ మేర్పడును. ఏమిగతిన్ + తలంచినన్ = ఏ విధముగా జూచినను, పగకు, మేలిమి, లేమి = విరోధమువలన శుభము కలుగకుండుట (లేకుండుట) ధ్రువము = నిశ్చయము.

21. కర్జము = కార్యము (ప్రకృతి) చేయదగినది. తాను + అది + అట్లులుండెడు = అది అట్లుండనిమ్ము, పోరితము = యుద్ధము, కామి = కాకుండుట, కులక్షయము = వంశనాశనము, వెలిగాగ = తప్పునట్లు, ఒండు + మైన్ = మరియొక విధముగా.

తాత్పర్యము — శాంతియే కోరదగినది; రాజ్యసంపదలకొరకు యుద్ధ ముచేయుట మా కిష్టముకాదు. సమస్త ధనములు నశించుటయును వంశనాశనము కలుగుటయును యుద్ధమునకు ఫలితములు. కావున

నది తప్పించి మరి యేవిధముగనైనను వ్యవహారమును బరిష్క‌రించుకొనుట మేలు.

22. మాదెస = మాయెడ, చొప్పున = విధమున, సజ్జనుల బుద్ధికిరాన్ = సజ్జనులు మెచ్చుకొనునట్లు, ఉచితంబుతోడి మెలువునన్ = తగియుండునట్లుగాను, ఉపాయముగాను, పరుసందనము = కరకుతనము ఆడుమిా = పలుకుము.

23. తగవునబోక = న్యాయమార్గమున చరింపక, బెడిదములు = పరుషపు మాటలు, పల్కెన+ఏని = పల్కినప్పటికిని. ఒప్పగ = అందరును మెచ్చుకొనునట్లు; నిలుమి = ప్రవర్తింపుము. గురుత్వము = పెద్దతనము, మాట+కొనమి = మాట వినకుండుట (అనుగుణము) ఆ సుయోధనుకడకు నిలువక = ఆ దుర్యోధనునివద్దనే ఉండగా, గౌరవంబుగ = ఆదరముతో, కురువృద్ధు = ధృతరాష్ట్రుడు, తలపున్ = అభిప్రాయము, జననిచ్చిన = చెల్లనిచ్చినచో.

24. సుతువాడై = కొడుకు పక్షము వహించినవాడై, వినయంబు చేకొనక = నీతిని పాటింపక, ఏచొప్పున్ + తగన్ + చెప్పక = తగినట్లుగా ఏ మార్గమును సూచింపక, సంధింపంగరాదు = సంధి కుదుర్చుట కష్టము, అంచు = అని, తెగక+పాఱకు = (సంధిగాకుండా) తెంపుజేసుకొనవద్దు, తెంపుసేయునెడక = (యుద్ధమే చేయవలసి వచ్చినచో) ప్రకాశిత ధర్మస్థితినొంది = మనము ధర్మపక్షముననే ఉన్నట్లు లోకమునకు తెలియునట్లుగా.

25. ఈ+భంగిక = ఈ విధముగా, నొగులు = బాధపడు, చిత్తవృత్తి = మనోదశ, నొవ్వు = బాధ, వెజ్జవు = వైద్యుడవు, తలచితి = అదియే.

26. వెండియు = మరియు.

27. శావరమునక = గర్వమువలన.

28. అనుపన్+చాలన్ = పంపలేను, ఒల్లను = అంగీకరింపను, ఒంటరి = ఒంటరివాడవై, ఉడుగు = మానుము.

29. తత్ + తనయుడు + ఏ + ఏల = అతని కుమారుడు మాత్రమే అన నేల, తక్కము = మానుము, వినన్ + వల + తేన్ = వినదలచినచో. నిక్కము + అలిసన్ = నిజముగా కోపించినచో; రణకేళికిమార్కొ నన్ = యుద్ధక్రీడయందు ఎదుర్కొనుటకు.

30. అర్థసంసిద్ధి = వ్యవహారము నెరవేరుట, ఒకటన్ = ఏఒక్కవిష యమునందును, రాక + ఉన్నికిన్ = రాకుండుటకు, కతమైన = కారణమైన; ఒండెను = లేదా.

తాత్పర్యము :— నేనక్కడికి పోయినచో వ్యవహారమైనను నెరవేరును లేదా మనయెడల దోషము లేదని ఎల్లవారికిని తెలియనైనను తెలియును.

31. యుధిష్ఠిరుఁడు = ధర్మరాజు

32. మేలుకాక = శుభమగుగాక, పోలినట్లు + అయినన్ = నచ్చినచో, అర్థిన్ = ప్రీతితో, పొంది = కలసి, ఒడఁబాటు = ఒడంబడిక.

33. ఎదిరి = శత్రువు, నెమ్మి = ప్రీతి, స్నేహము, నెరి = అందము

34. ధర్మ + ఏకనిష్ఠము + అయి = ధర్మమునందే స్థిరమైన నిశ్చయము కలదై, బిరుదులు = బలవంతులు (అహంకారముగలవారు) రాజ న్యులకు = క్షత్రియులకు, అడఁగి = లోబడి, కుడువన్ + అగునె = అనుభవించుట (బ్రతుకుట) తగునా; అక్లేశవృత్తిన్ = కష్టపడ కుండా, చవిగొన్నవారు = రుచిమరగినవారు నడి = నింద, అలు కరు = భయపడరు; పొడువు, కయ్యము = యుద్ధముసేయుము, అరివర్గజయము = శత్రుసమూహమును జయించుట, ఇహ పరములు = ఈ లోకమున రాజ్యమనుభవించుట, పరలోక మున రాజ్యమును చక్కగా పాలించిన పుణ్యఫలము ననుభవిం చుట, చిరకీర్తి = శాశ్వతమైన కీర్తి.

35. గురు = ద్రోణాచార్యుడు. ముష్కరులు = దుర్మార్గులు పొం దన్ + ఓపరు + అ = పొందనే పొందరే, తక్కము = మానుము ఎవ్వరికిన్ + కోపింపరే = ఎవరికైనను కోపము వచ్చును.

36. నెత్తము = జూదము, పుయిలోట + తక్కి = సంశయము, భయములేక; సూతనందనుడు = కర్ణుడు, ఉగ్గడింపవచ్చునే = బహిరంగముగ చెప్పుకొనవచ్చునా (చెప్పతగనిది అని భావము), పోక = పోవుట, అచ్చెరువు + పాటు = ఆశ్చర్యము, ఉమ్మలించు = లోలోన దుఃఖపడు, తిట్టు + పాట్లన్ + పోయెడు వారు = లోకనిందను పొందువారు; దైవ + ఉపహతులు = దైవముచేత అణచబడినవారు, చెఱపనున్ = అణచుటయు, చులకన = తేలిక, ఎట్టెట్లు = ఎట్లో అట్లే, నిర్విచారంబుగా = వెనుకముందులుజూడక.

37. చేతోముదము = మనస్సంతోషము, ఒదవన్ = కలుగునట్లు, భక్తి + చేయన్ + ఏ + తగున్ = భక్తితో నుండుటయేతగును, అతలకు = అచ్చటికి.

38. చుట్టలు = చుట్టములు, దేశంబుల = దేశములందలి.

39. తెఱంగు మాలిన = పద్ధతికాని (న్యాయసమ్మతముకాని) వారింప, నేరమి = వారింపలేకపోవుట, ఉపేక్షకుండు = ఉపేక్షించువాడు, ఓపినంత = శక్తికొలది, అట్లు గాక తక్కిన = అట్లుగానిచో, చేయంగలవారు = శక్తివంతులు, వర్తనంబులు = నడవడులు, కొలందులు = శక్తులు (పరిమాణములు)

40. అవి = ఊర్పు (ప్రాణము) పోరు + అ = యుద్ధమే.

41. చతురంగబలములు = రథ, గజ, తురగ, పదాతులు, అయితము = సిద్ధము, వృకోదరుండు = (బొటనవ్రేలంత జఠరాగ్ని కలవాడు) భీముడు, దామోదరుడు = కృష్ణుడు.

42. వెఱపించు = భయపెట్టు, కుమతి = దుష్టబుద్ధి, ధార్తరాష్ట్రుడు = దుర్యోధనుడు, శమించు = శాంతించు, నడవు = నడపుము, సౌజన్యమునన్ = మంచితనముతో.

44. నీపంపు = నీ ఆజ్ఞ (చెప్పినట్లు), మానోద్రేకమునన్ = అభిమానము వలన గలిగిన ఉద్రేకము, కుందించుటన్ = దుఃఖపెట్టుటచేత (వారి

సదుపదేశములను వినక), పోయినట్లే పోనిత్తురు = వాడెట్లు సంచరించినను ఊరకొందురు, జాలింబెట్టు = కష్టపెట్టు.

45. చోన = చోటు, తెగజూచెదను = నాశనము చేయజూచెదను, కడంగు = ప్రయత్నించు, పొచ్చెము = విరోధము, కూడి మనఁబోవక పోవగరాదు = కలసిమెలసి ఉండకుండుటకు వీలులేదు (కలిసియే ఉండవలెనని భావము) విబ్బచ్చుడు = (బీభత్సుడు అను శబ్దమునకు తద్భవము) అర్జునుడు, ఓపకుండుటన్ = అంగీకరించక పోవుటచేత.

46. నెమ్మనమై = స్నేహముతో, తీర్పు = నచ్చజెప్పుము.

47. పొరివోవు = నాశనమైపోవు, ఉదగ్రత = రోషము, మెయిన్ = పద్ధతి, ఇష్టము ఆయన...ఒప్పునో = అతనికి నచ్చు విధముననే మాట్లాడి మాకు భాగముత్క్కవచ్చునట్టి సంధికుదిరించినను ఎంతయో మేలుకలుగును.

49. పోలదు+ఒక్కొ = తగునుగదా

51. భీముపాలన్ = భీమునివిషయమున, భూరిభూధరము = మహాపర్వతము; లాఘవము+ఒందుట = తేలికయగుట; మార్దవము = మెత్తదనము.

52. ఆజిన్ = యుద్ధమున, ఒల్లమి = అంగీకరింపకుండుట, అర్ద్రుడు = మనస్సు మెత్తబడినవాడు పవనజుడు = వాయుకుమారుడు భీముడు

53. మురమర్దనుడు = కృష్ణుడు.

54. అల్కఁజేయు = భయపెట్టు, దర్ప+ఉద్ధతి = బలాధిక్యము, పపు = గర్వము, నిజ = తనయొక్క, అసంబద్ధములైన = తగని, కీచకాంతకా = కీచకుని చంపినవాడా. ఈ సంబోధనము భీముని రోషమును ప్రజ్వలింపజేయుటకు సాభిప్రాయముగా వాడబడినది.

55. శౌరి = కృష్ణుడు.

57. దరహాసితవదనుడు = చిరునవ్వుతో కూడిన మొగముకలవాడు,

58. నృపకుంజరుడు = రాజశ్రేష్ఠుడు, ఉపేంద్ర = కృష్ణా, మూదలించు = హెచ్చరించు.

తాత్పర్యము — "యుద్ధపుమాటలు చెప్పకుము పాండురాజ కుమారులమైన మనకు మన తండ్రి భాగము వచ్చిన చాలును" అని మున్ను ధర్మరాజు చెప్పగా నేనూరకున్న సంగతి నీవెరుగుదువు గదా ? యుద్ధరంగమున దుర్యోధనుడు చచ్చిపడియుండగా నీకు చూపి "కృష్ణా! ఆనాడు నన్ను నీవేమంటివి" అని నిన్ను యుద్ధమున హెచ్చరింతును.

59. కొలఁది = శక్తి, మిన్ను = ఆకాశము, ఇమ్ముగాక = ఉన్న విధముగా నుండక, పోక = ఊరకుండక, ముందు + చేతులు = ముంజేతులు, ఒడ్డి = అడ్డపెట్టి

60. నావుడు = (రూపాంతరము) అనవుడు, కేవలయోధవే = సామాన్య యోధుడవా, కిల్బిషములు = పాపములు, ఈ + మెయిన్ = ఈవిధముగ, జావడము = పౌరుషము లేమి, చేవ = శక్తి, లావు = బలము.

62. పార్థుడు = అర్జునుడు, కడపక = నడుపుటకు, ఒంటన్ = మరియొక దానివలన.

64. దండిమగలు = గొప్పయోధులు, సంగ్రామక్షోభము = యుద్ధపుటలజడి, మిట్టు = ఎత్తైనచోట్లు; వెఱగు = ఆశ్చర్యము, ఈసారెకు = ఈమాటికి, ఈ + తఱి = ఈ సమయమున, రిత్త = వట్టి, సూ = చూచితివా, పెంపు + అఱన్ = గొప్పతనము పోవునట్లుగా

65. మేలంపుమెయివడి = పరిహాసముతో కూడుకొన్న, సరసంబు + ఆడుటయు కాన్ = కేవలము సరసపు మాటలుగానే, తనివి + పోవక = తృప్తిజెందక.

66. కయ్యము = యుద్ధము, గంధగజప్రకరంబుకుంభముల్ = మదించిన ఏనుగు సమూహముల కుంభస్థలములు, వ్రయ్యన్ = బ్రద్దలు కాగా, తేరిగముల్ = రథసమూహములు, డయ్యమికి = అలసిపోకుండుటకు, వెక్కసపడు = ఆశ్చర్యపడు, దయ్యము + ఎత్తికోలు =

దైవసంకల్పము, తుదిదాకుట = నెరవేరుట, భుజంగభంజనా = (కాళీయ) సర్పమర్దనా

67. పావనీ = పవనపుత్రుడవగు ఓ భీముడా, కడింది = గొప్ప, వార్ధి = సముద్రము.

68. పద్దనికిరాన్ = పాకమునకు వచ్చునట్లు' కుదురు = మూలము.

71. కృష్ణాము = దుర్మార్గుడు, కైపెక్కిన = నిశ్చితమైన, పెట్టినయట్ల యుండన్ = (ఉపయోగించకుండా.)

72. సంభావన = ఊహించుట, ఆలోచించుట, పౌరుషము = పురుష కారము

73. వేరిమి = వైరముతో, వధ్యులు = చంపదగినవారు, పోలదే = తగు కదా, ఈరసము = ఈర్ష్య, కీడ్పఱచి = బాధపెట్టి, కూరిన = కూడు కొన్న, నొవ్వుసొంపు = అధికమైనబాధ.

74. ఆత్మజ = కూతురు, సైపన్ = సహించుట, కారుణిక = దయగల వాడు.

75. అలవి = శక్తి, కడంగి = పూని, పఱిచిన = పెట్టిన, చవుటన్ = చవిటి నేల.

76. మొఱకులు = మూర్ఖులు.

78. చిత్తమునకు రాకుండిన = నచ్చకపోయినచో.

79. వలంతి నే = సమర్థుడనా, పంచితి = ఆజ్ఞాపింతువో.

81. వెరవు = ఉపాయము, దొరకొనునే = లభించునా, తఱితో = సమయమునకు, పరుసు = విధము, సూవె = సుమ్మా.

82. చేఁత = కార్యము, పాడి = న్యాయము నీతి.

83. పసులన్ + పెట్టింప = పశువులను విడిచిపెట్టింప.

84. రాలచ్చి = రాజ్యలక్ష్మి, కుందు = అపజయము, తొడరుట = ప్రయత్నించుట, ఓర్చుట = సహించుట (తగియున్నది.) ఒక్క మొయిక్ = ఒకేవిధముగా, పొందు = కలయిక (సంధి).

86. ఈను = ఇవ్వను, సమర భంగిక విక్రమనిరతి = యుద్ధపద్ధతియందు పరాక్రమము జూపు నిశ్చయము.

87. పదంపడి = తరువాత.

89. మత్స్యమహీపతి పాలనున్న + ఆదినములు = విరటునిసమీపమందున్న అజ్ఞాతవాస సంవత్సరము, కడవగ = అతిశయించునట్లు.

90. పసరము = పశువు, అడిచిన = కొట్టిన, తెరువు = మార్గము.

91. కోలెన్ = మొదలుకొని, అక్షౌహిణి = సేనావిశేషము (21870 రథములును, అన్నియే గజములును, 65610 అశ్వములును, 109350, పదాతులును కలిగినసేన) తెంపు = సాహసము, అలుకరెట్లు = ఎట్లు భయపడకుందురు ?

93. రక్కసమాటలు = పరుషపుమాటలు, (సహించరాని మాటలు)

94. చలంబు = పట్టుదల, ఈక = ఇవ్వక.

తాత్పర్యము :— మీరందరు వీరులు, మీకిట్టి దీనవుపలుకులు పలుకుట తగదు. బంధువులును స్నేహితులును తిట్టుదురు. ధర్మరాజంతటివాడు వేడుకొనుట, కృష్ణునియంతటివాడు దుర్యోధనాదులను పాండవులకు భాగంబిమ్మని యాచింపజనుటా ? వారు ఈమాటలు కాదని యుద్ధమునకే సిద్ధపడుటా ? ఇంతకంటె హాస్యాస్పదమైన విషయమింకొకటి యుండునా ? తిండికిని - బ్రతుకునకును క్షత్రియులమగు మనమింత ఆశపడనేల ? ఇంతటి నైచ్యమునకు పాల్పడనేల ?.

95. తాత్పర్యము —ధర్మముచొప్పున మీరైదు గ్రామముల నడిగి వారలంచుకు సమ్మతించినను అట్టి సంధి నెరవేరదు. కాబట్టి యుద్ధమే తగినది. ఏవోవంకమాటలు పలుకుట నాకుచేతకాదు. కౌరవవీరుల సభలో నా నిశ్చయమిట్టిదని పలుకుము. (తరువాత పద్యముతో అన్వయము)

96. అనుకొన్నట్లు వనవాసము, అజ్ఞాతవాసము చేసివచ్చిన పాండవులకు న్యాయముగా అర్ధరాజ్యము రావలసియున్నది. కౌరవులు అట్లు లీ

యనిచో బలిమిమై దానిని పుచ్చుకోఁగలశక్తి పాండవులకున్నది. ధర్మరాజాదులట్లు పరాక్రమింపక బేరమునకు దిగి, ఐదూళ్ళు చాలునని రాయబారమంపుటయు, అవియును కౌరవులీయనిచో నేమిచేయవలెనని దీర్ఘవిచారముచేయుటయు సహదేవునకు నచ్చ లేదు. ఆతనిది శౌర్యపద్ధతి. అందువలన దుర్యోధనుకిట్లు కబురంపు చున్నాడు. "వనవాసము, అజ్ఞాతవాసము చేసివచ్చినమాకు అర్ధ రాజ్యము రావలసిఉన్నది. నిరాకరించేఅధికారము నీకు లేదు. న్యా యముగా మా యర్ధరాజ్యము మాకీయవేని ఇంక నీతో రాజీ లేదు. నీవును మావలెనే పదమూడేండ్లు వనవాసాదులు చేసిరమ్ము. అంతవరకు యావద్రాజ్యము ఇన్నాళ్లు నీవలె మే మనుభవింతుము. నీ వట్లు తిరిగివచ్చి పిమ్మట అర్ధరాజ్యము గైకొనుము. అంతేకాని పాలీకుండ నెట్లుపోయెదవు? అట్లు తిరిగివచ్చుట కంగీకరింపవా, రాజ్యముకొఱకు యుద్ధమొనర్చి గైకొనుము. అంతియేగాని ఇంక నీ విచ్చువాడవు మేము పుచ్చుకొనువారము గాము. నీ మాయలు, నీ కపటములు ఇక చెల్లవు.

97. సరభసోత్సాహంబుమైన్ = తొందరపడుచున్న ఉత్సాహంబుతో, నికాయము = సమూహము.

98. ఒప్పఁగ = తగునట్లుగా, తక్కటివి = మిగిలినవి, భంగంబు = అవ మానము, ఈగికొనుట = తీర్చుకొనుట, కొలువు = సభ, ఎలుం గులు = కంఠధ్వనులు, నింగి = ఆకాశము.

99. ఒయ్యన్ = మెల్లగా, కనలి = కోపగించి.

100. పుచ్చు + తెంచు = పంపుట, ఊఱటన్ = ఓదార్పుచేత, నొంచున = బాధపెట్టునా

తాత్పర్యము—అన్ని బాధలుపెట్టి అడవికివెళ్లగొట్టి, చివరకు సంజయుని ఓదార్పుమాటలను పలికిరమ్మనిరి. దానికే ధర్మరాజు సంతో షించినాడు. దుర్యోధనుడు తనంత ఐదుగురికిని ఐదూళ్లు యిచ్చునా ? అయినా అన్నదమ్ములు గనుక ఒకవేళ జాలిపడి యిచ్చునేమో ? (ఇవ్వడని ఎకసక్కె మాడుచున్నది).

101. బన్నములు = కష్టములు, తమ్మునిపై (దుర్యోధనునిపై), కూర్మి పేర్మిన్ = ప్రేమాధిక్యముచేత, ఈ జనపతి = (ధర్మరాజు), చక్కన = మంచిదే, పాలులేని తీఱునకు = భాగమురాని పద్ధతికి, ఎఱుంగమి + పెట్టరే = అజ్ఞానము నాపాదించరా, నాన = సిగ్గు, రూపింపంగ = నిరూపించుట, విచారింపన్ = ఆలోచించగా పట్టు = స్థానము.

102. తాత్పర్యము—లోకమున మనము శక్తిహీనులమని ఏల అనిపించుకొనవలయును? మనస్థితిని, వారి స్థితిని పోల్చినచో సంధివారికే మేలు. వారిని మనవారు సాధింపలేరా? యుద్ధములోనే వారిని చంపదలంచుకొన్నచో ఇంకను అనుమాన మెందులకు? వారు చేసిన అపరాధములను సహించుటకు దుర్యోధనాదులు బ్రాహ్మణులా? (జ్ఞాతుల పోరితనమును, గోవ్రాతను నాక్రమము విప్రవర్గము చనవున్ నాతుల గారించుటయును ప్రీతిన్ జననిచ్చు నతని పెంపొప్పు నృపా) ఇది భారత ధర్మము.

103. ఓట = భయము, పోటు = యుద్ధము, కానలు = అడవులు.

104. నా+వలదు = అనవద్దు.

106. ఆఱడిబోకయున్ = వ్యర్థమగుట, మాఱటనోరిదానను = ఏదో మాఱుమాటలాడు స్వభావముగలదానను, కాఱులు = పరుషపు మాటలు, అల్కమైన్ = కోపముచేత, పీఱేడి = అవివేకి.

107. వంద్యులు = నమస్కరించదగినవారు. సహజన్ములు = సోదరులు, ప్రాపు = సహాయము.

108. తలిర్పన్ = అంకురింపగా (కలుగునట్లుగా) సంభావన = గౌరవము, అవభృథ = యజ్ఞదీక్షబూనినవారు యజ్ఞాంతమునందు చేయు స్నానము, శుచి = పవిత్రము, పెనుపు = గొప్పతనము, వేణి = జడ.

109. అసంభ్రములు = ఉద్రేకములేనివారు, నా+ఆసలు = నామీద ఆశవదలి, ఎడన్ = సమయము.

111. అరయమిజేసి = ముందువెనకల జూడక, చెచ్చెరన్ = శీఘ్రముగా, పాడిమై = న్యాయముగా, కోటరంబు = కోడంట్రికము, వరవుడము = దాస్యము.

113. ద్రోవది = ద్రౌపది; బంధురము = చక్కని క్రొమ్ముడి = (జుట్టు ముడి) విడ్చి = ఊడదీసి, వల = కుడి, అసితచ్ఛవిఁ = నల్లని కాంతితో, పొల్చు = ఒప్పి, భుజంగమోనాన్ = సర్పమో అనునట్లుగా విలసిల్లి = ప్రకాశించి, వ్రేఁగన్ = వ్రేలాడగా, బాష్పములు = కన్నీరు.

115. తవిలి = తగులుకొని, త్రెవ్వి = తెగి, తీఱుమాటలు = సంధి మాటలు, తీర్పుమాటలు

116. తునియలై = ముక్కలై, రూపఱియున్న = నశించిన, ఉడుకు = రోషము, అలుపాలన్ = అల్పకార్యములచేత, పొనుపడు = ఆరునట్టి, నిస్తేజమగు; కవ్వి = అర్జునుడు, కన్నారన్ = కండ్లార, రాజరాజు = దుర్యోధనుడు

117. నెట్టన = ప్రయత్నముతో, రక్కసతాల్మిన్ = పెద్ద ఓర్పుతో, చిచ్చు = అగ్ని, తోఁబుట్టువు = సోదరుడవు.

118. రాలుపడన్ = వణకగా, యాజ్ఞసేని = ద్రౌపది (ద్రుపదునికి యజ్ఞముచేయుటవలన కలిగిన కూతురు) పెను+నెఱి+వేణి = పెద్ద అందమైన జడ.

119. మ్రిచ్చిరక = నొచ్చుకొను, ముద్దియ = ముద్దరాలా, మేకొని = పూని, వేఱొకండు = మఱియొకటి, అచ్చుపడంగ = ఏర్పాటుకా.

120. లలన = స్త్రీ, కొలదియే = అంతు (పరిమితి) కలదు, కళత్రము = భార్య.

121. యమమహిష = యముని వాహనమైన దున్నపోతు, ఘంటికా నాదము = చిరుగంటల నాదము, తళుకొత్తెను = అంకురించెను.

122. విధినియతి = విధినియమము.

124. అంకిలి = కలత, ఉడిగెఁ = మానెను.

125. ఏరూపునందు = ఏవిధముగానైనను, ఒక్కరూపు + అ = ఒక్కపోలికయే.

129. రేపకడయ = రేపటి ప్రాతఃకాలము, కలయఁగనుంగొని = నలువైపుల చూచి, ఉపాస్తి = ఉపాసన, దూర్వ = గరిక.

130. సవరణతో = సన్నాహముతో.

131. దారుకుడు = (కృష్ణుని సారథి) ప్రభ = కాంతి, పటల = సమూహము, జటిలము = దట్టము, పన్ని = సిద్ధముచేసి, కడు + ఆయితము = పూర్తిగాసిద్ధము, ఉల్లసిల్ల = ప్రకాశింపగా, ఆంగికములు = శరీరసంబంధములు, పూర్ణకలశము = నిండుబిందె వృషభము = ఎద్దు, భద్రపదార్థము = మంగళపదార్థము, సేసలు = అక్షతలు, ఒలుకన్ = పడగా.

132. భద్రదంతి = మదపుటేనుగు, విడిదల = విడియుచోటు, పఱపు = విస్తీర్ణత, కరము = మిక్కిలి, కదియు = తాకు (సమీపించు)

133. గొంతి = కుంతి, గ్రుచ్చి + ఏ = (గాఢముగానని భావము) కుందిన = బాధపడిన.

134. దవ్వు = దూరము, డించి = దిగవిడచి, ఉమ్మలికము = దుఃఖము, బడుగు = వృద్ధురాలు.

135. నెర + వగ = మిక్కిలి దుఃఖము.

136. ఏననుటగాఁగ = నామాటగా.

139. పరిరంభణము = ఆలింగనము, సాంద్ర = దట్టమైన (అధికమైన) మధ్యస్థుడు = పక్షపాతరహితుడు.

141. సాము = సగము, గ్రొచ్చి = త్రివ్వి.

142. తెల్లంబుగన్ + ఒనరన్ = స్పష్టముగా ఒప్పునట్లుగా, పేరు + ఎలుగు = పెద్దధ్వని, వక్త్రంబు = ముఖము, పొలుపు = అందము, దర్పంబు + ఒలయుంగన్ = దర్పము తాండవించగా, పొంగారు =

అతిశయించు, ఉద్జృంభితధ్వనియై = పెద్దధ్వనికలదయై, సింధురము = ఏనుగు.

144. వలగొని = ప్రదక్షిణముచేసి, మఱిడిరి = తిరిగిరి, ఆమంత్రితులై = సెలవీయబడినవారై, పెను + తెరువు, పెందెరువు = పెద్దదోవ పటుత్వంబున = బలమున, సమీచీనము = తగిన, కుశస్థలంబు (ఒక గ్రామముపేరు) పట కుటీరప్రకరంబు = డేరాలసమూహము

146. అభిగమ్యుడు = చేరదగిననాడు, సంవిధానంబు = ఏర్పాటు

147. ప్రతతి = సమూహము.

149. మృగమదము = కస్తూరి, దామకములు = దండలు, కూటము = సభ

150. నగళ్లు = రాజగృహములు, దేవాలయములు

151. చప్పరము = మీదపందిరివలె ఏర్పరచిన నలుచదరపు మండపము

152. విడిపట్టు = విడిదిచోటు, మాల్యంబులు = మాలలు. తజ్ఞులు = నేర్పరులు. ఆంబికేయుండు = అంబికాకుమారుడు ధృతరాష్ట్రుడు

153. జవన = వేగవంతమైన. సామజము = ఏనుగు, నివహము = సమూహము.

154. నికేతము = ఇల్లు, ఇంచు = ప్రీతిని బుట్టించు

156. జేల = అజ్ఞాని, సదృశ = సమానమైన, అర్థము = ద్రవ్యము, సుమేరువు = బంగారుకొండ, క్రీడి = అర్జునుడు (కిరీటిశబ్ద తద్భవము)

157. మిగులన్ = అధికముగా. ఒండు = వేరు.

158. పూనికమెయిన్ = పూనికతో, వంచింపక = కడమపెట్టక (పరిపూర్ణ మగునట్లు), తక్కు వేయున్ = మిగిలిన వేయుపనులు.

160. పదను = ఔచిత్యము (తరుణము), ఈగి = ఈవి - త్యాగము, ఒచ్చెము = హాని.

163. తేర్పన్ = ప్రసన్నులను చేసికొనుటకు, నెరవుగ = ఉపాయముతో.

166. ఏడుగడ = రక్షకుడు, పులుగులు = పక్షులు, అనువు = ఏర్పాటు, విచారంబు = ఆలోచన, వైచిత్ర్యవీర్యుండు = విచిత్రవీరుని కుమారుడు.

167. అబాధ్యతకు = బాధింపకుండుటకు.

168. ఆకొలదియె = బాధింపకుండుటకు. ఈ కారణములు [redacted] కలవాడు కాడని భావము.

169. ప్రాణగొడ్డము = ప్రాణాపాయకరము, ప్రభానులు = ముఖ్యులు, కొఱగాములు = పనికిమాలినవి, చేటు = కీడు.

170. కజ్జంబులు = భక్ష్యములు, పుత్తెరఁ = పంపగా, ఎడనెడఁ = మధ్యమధ్య.

171. తూర్యములు = బాజాలు, సమకట్టి = సమకూర్చి, సవిశేష = అధికమైన, చేరువ = సమీపము, ప్రమోద = ఆనందముచేత, చాపల = అటు నిటు తిరుగాడుచున్న, సుభగజనము = అందమైన జనులు కలది, మౌక్తికమిళితములు = ముత్యములతో కలసినవి, లుళితంబులు =(కలసి) పడుచున్నవి, చొక్కుచు = సంతోషించుచు, ఇరుకెలంకులఁ = రెండుప్రక్కల, హర్మ్యములు = మేడలు, పొలిచి = ఒప్పి.

172. వ్రేల్మిడిన్ = చిటికలో, ముట్టిచ్చిలన్ = దొంగిలించుటకు, శ్రుతి శిరోభాగముల = ఉపనిషత్తులపై, ఆమోదము = పరిమళము, (ఉపనిషత్తులు పరమపురుషుని గురించి వర్ణించునని భావము).

173. వేత్రహస్తులు = చోపుదారులు, జయము = (జయించునని భావము) కక్ష్యాంతరంబులు = శాలామధ్యప్రదేశములు, మొగసాలఁ = ముఖద్వారమున, ముంగిలి, పొదువఁ = చుట్టుకొని, ప్రత్యుత్థానము సేయుట = ఎదుర్కొనుట.

175. ఉనుపన్ = కూర్చొబెట్టగా, విహిత = విధింపబడిన, మధుపర్కము = తేనె పెరుగు మొదలగునవి కలిపిపెట్టు ఉపహారము.

176. తియ్యము=ఇష్టము, పేరు+ఓజ+మెయిన్ = మిక్కిలి తేజస్సుతో, మేలములు = పరిహాసములు.

177. కందళితుడు = (సంతోషము) అంకురించినవాడై.

178. ఓగిరము = ఆహారము.

179. బోని = పోలు, అడలు=భయ దుఃఖములు,

180. సూరెల = ప్రక్కలయందు, ఎద = హృదయము, బృంహిత ములు = ఘీంకారములు, మెకము = మృగము.

181. ప్రజలు=బిడ్డలు.

183 పంచానన=సింహము, కవలు = (జంట) నకులసహదేవులు.

184. కూర్తున్ = ప్రేమింతును, అగ్రగణ్య = శ్రేష్ఠురాలు, క్రొత్తడి = పతివ్రత, పొక్కితిన్ = దుఃఖపడితిని

185. అంతగడచిన = అంతకంటె మించిన

187. సదస్యులు = సభ్యులు, నారు+అ = అనరేకదా! కుదురు = మూలము.

188. ఉమ్మలికంబు = దుఃఖంబు, వెల్లి = ప్రవాహము, దిగంబారెడు = కుదుటబడిన

189. తల = వంతు, అదయమగుకూడు = దయలేనికూడు

190. వెన్నుడు = కృష్ణుడు

191. దురితరహితులు = పాపములేనివారు.

192. కీడాడుట = నిందించుట, ప్రయివెట్టుట = నిందించుట; మొగులు ముట్టిన = ఆకాశమునంటిన (మొగులు మేఘశబ్దమునకు తద్భవము, మొయిలురూపాంతరము

193. కృపణులు = దీనులు, కను = పొందు, పోడిమి = విధము, మైవాడిమి = శరీరబలము, ఉలుకుదురే = భయపడుదురా?

197. ప్రజలకు = సంతానమునకు.

198. ఈగన్ = తొలగించుట, అలత = దుఃఖము:

199. అనునయించి=ఓదార్చి.

200. ఎడన్ = హృదయమునందు, వగలు=దుఃఖములు, కలత = విచారము.

202. అలంతులన్ + పోక = క్షుద్రమార్గము ననుసరించక.

203. ఉత్పాదనము = నాశనము.

204. నెగడువారు = వర్ధిల్లువారు.

205. చేరుగడ = శరణ్యుడవు.

206. పఱచి = పరుగెత్తి, పఱతెంచి = వచ్చి, ఎడగలుగన్ = తోవ ఏర్పడునట్లుగా, పేరోలగంబు=నిండుకొలువు, సందడి=సమ్మర్దము, జడియుచు = తొలగబెట్టుచు, ప్రత్యుత్థానము = ఎదురుకోలు.

207. పర్యంకము = మంచె (సోఫా) ఊర్జిత = తేజోవంతమైన.

209. కుడుపుతెఱంగు పుట్టించి = భోజనాభిరుచి కలిగించి, ఒల్లకయునికి = అంగీకరింపకుండుటకు, ఏర్పడగ = స్పష్టముగా.

210. సూర్యసూనుడు = కర్ణుడు.

211. ఎరవు = వేరువిధము, పెనపరి = వివాదశీలుడు (పెద్దమనిషి).

213. బాహిరంబు = విరుద్ధము - వెలియైనది.

214. అసదృశ = సాటిలేని, కూరుతు = ఇష్టమైనవాడవు, కతము = కారణము.

215. ఉపేంద్రుడు = కృష్ణుడు - ఇంద్రునకు తమ్ముడు; తొడగుదురె = ప్రారంభింతురా? కొనన్ = (ఉపచారములు) అందుకొనుటకు; కట్టన్ = (వస్త్రము) కట్టుటకు.

218. పల్లవము = చిగురుటాకు ; తెమల్చు = లాగు ; కేలన్ = చేతిలో ; తేటపఱుచుట = విశదపరచుట.

219. మేవడి = ఉచితము ; అయనయములు = (రూపాంతరము - అయానయములు)=మంచిచెడ్డలు ; ధృతిపెంపఱన్ =ధైర్యముతగ్గిపోగా.

221. పగవారు = శత్రువులు ; ఒడళులు = శరీరములు.

223 ఇట్టలముగ = అధికముగ.

224. కౌంతేయులు = కుంతీపుత్రులు. పాండవులు,

225. కుంభసంభవుడు = ద్రోణాచార్యుడు, ఆయితంబు = సిద్ధము, వచ్చినవాడన = వచ్చినట్లే. గైకొంటిన = స్వీకరించినట్లే.

226. సంభ్రమము = ఆదరము, మజ్జనము = స్నానము, బోనాలు = భోజనములు, ఓజమై = క్రమముగా, పూత = పవిత్రమైన, సంప్రయోగమగు = చక్కగా ప్రయోగింపబడినది, ఎలమి = వికాసము, సంతోషము, మంజులము = ఒప్పిదము, లలితము = మనోజ్ఞము.

229. కృతాహారుండు = భోజనము చేసినవాడు, గణిక = వేశ్య. పాఠకులు = వేదపాఠము చదువువారు, వాంశికుడు = పిల్లంగ్రోవి నూదువాడు, వైణికుడు = వీణవాయించువాడు, అభిమతార్థంబులు = ఇష్టమైనకోరికలు.

230. నీచు = నీచుడు, (నీచశబ్దభవము)

232. కూడంబారి = ఒక్కచోజేరి, బీఱుపోవుట = వ్యర్థమగుట, ఏక+అర్థులు=ఒకే ప్రయోజనముగలవార్లు, గండు=పౌరుషము, బలము+ప్రాప్తకాలము = చావుకాలము. వెంగలివిత్తులు = మూఢాగ్రేసరులు, వీఱిడి = అవివేకపు, వంకలొత్తి = దోషములు సవరించి మొఱకులు = మూర్ఖులు, వారలతలంపులు గీడు (కీడుకలగజేయునని భావము.)

233. ఆప్తి = స్నేహము, పొందు, నెఱపు = నెరవేర్చు.

234. కొఱ+కామి = దుర్లక్షణము అఱుముట = ప్రతీక్షించుట, ఆక్రమించుట.

235. ఒడ్డగెడవు = ఒకప్రక్కక్రిందికొరగి మరింకొకప్రక్క పైకిలేచుట. వాజి = గుఱ్ఱము. తివురు = కోరు.

237. వెరవు = ఉపాయము, పరిణతి = పరిణామము

239. ఒప్పమి = కీడు (వైరము)

240. అజ్ఞులు = అజ్ఞానులు, కలగంబాఱిన = సంక్షోభితులైన

241. పాలకడలి = పాలసముద్రము కడలు = అల

242. మాగధులు = వంశవీర్యాదులను పొగడి జీవించువారు. వేగు + పోక = వేకువ, ప్రభాతము, సమయకర్తవ్యంబులు = కాలకృత్యములు

243. ఇన తనయుడు = సూర్యునికుమారుడు (కర్ణుడు)

244. క్రాలన్ = అల్లలాడగా, పార్శ్వంబులన్ = ప్రక్కల ఉలివు = మోత, అవతరించి = దిగి.

246. అభ్యంతరులు = లోపల నున్నవారు, పొదువుట = చుట్టుకొనుట, రవి = సూర్యుడు.

249. సత్వరముగ = వెంటనే.

250. మునులవలని = మునులవంక, గద్దియలు = గద్దెలు, చేరువన్ = సమీపమున, అర్తమిల్లుట = ఒరుగుట, గాంధారరాజు = శకుని.

251. అంబుదము = మేఘము, పీతాంబరము = పచ్చనివస్త్రము.

252. అచలము = పర్వతము, (చలనము లేనిది) వింజము = అడవి, ఆకిడిన యట్లు = చిగిరిస్తినట్లు.

253. జలదము = మేఘము, దీప్తులు = కాంతులు, ఎసగన్ = అతిశయించగా.

254. తగవున్ = న్యాయము, అన్వయము = వంశము.

255. ఒడగూడి + మనికి + కలిసిబ్రతుకుట

256. నుతి = ప్రశంస, అనుగు = ముఖ్యుడైన, సుచరితము = మంచిచరిత్ర

257. వెలి = బాహ్యము, వృత్తము = నడత, అగ్రణి = ముఖ్యుడు.

258. సధర్ములు = ధర్మముకలిగినవారు, ఎడలును = దూరముగాపోవును. అన్వయంబు వర్తనము = కులాచారము, నాక = అనక, జెడి

దంపుతనము = క్రూరత్వము, అవగుణంబులు = దుర్గుణంబులు పుఱులోడరు = సిగ్గుచెందరు. సంశయించరు.

259. పోరితము = యుద్ధము, గణుతించుట = లక్ష్యముంచుట, ఎంచుట; పొందు = సంధి

260. నెఱి + అ = మంచిదే, తెలివి + ఒందఁగ + చేయు = తెలియజెప్పు.

261. ఆహవము = యుద్ధము, కేళిసేయువారు = అతిశయించువారు, ఈల్గుట = చచ్చుట

262. వేల = చెలియలికట్ట, ఆవృత = చుట్టబడిన, ఉర్వి = భూమి, ప్రజలు = సంతానము

264. ఉర్వి = భూమి

265. లోనిరిత్తబవరము = తమలోని వ్యర్థమైన అంతఃకలహము, అఱడి = పోరు, కైదువు = ఖడ్గము, కూరగఁనాటినన్ = చొచ్చుకొని పోవునట్లు నాటుకొనగా.

268. శైశవము = బాల్యము, పారము = గట్టు.

269. సమయము = ప్రతిజ్ఞ, జనపదము = గ్రామము, కినిసి = కోపగించి.

270. పారముబొందలేక = తుదముట్టలేక, దక్షులు = సమర్థులు, నిస్తారకము = తరింపజేయునది.

తాత్పర్యము :— ధర్మ మధర్మముచేతను, సత్య మసత్యముచేతను హానిపొందుచున్నప్పుడు సమర్థతయుండియు నుపేక్షించుట తమ చేటునకే యగును. కాని దైవము ధర్మమును, సత్యమును ఎట్లును రక్షించుకొనజాలియే యుండును.

271. ఏకరూపము = ఒకేరూపముగల

272. మేదిని = భూమి, వాక్యవిదులు = మంచిచెడ్డలు తెలిసినవారు

273. అఱ = మర్మము

274. చయము = సమూహము, మదిమదిన్ + ఉండన్ = శాంతులై ఉండగా.

277. ఆర్చి = అణంచి, సెంబలుడు = శకుని.

278. బొంగులు = మర్బలులు లేక ఊరపిస్త్రలు, పెడసేయి = మీాఁజేయి, పూన్కి = పూనిక.

281. పథ్యము = హితము.

282. రోమహర్షణము = రోమాంచము, గగుర్పాటు ; నయకోవిదుడు = నీతిజ్ఞుడు ; అనువరి = ఉపాయశాలి.

284. అనునయించి = నచ్చజెప్పి.

285. అనూనుడు = తక్కువకానివాడు ; అగునే = తగునే ; దురాగ్రహము = చెడుపట్టుదల.

286. ఇట్టిదొర = ఇట్టిప్రభువు ; వెడమాటలు = తప్పుడుమాటలు ; ఊఁకొనుట = అంగీకరించుట, సేగి = ఆపద.

287. గురుడు = ద్రోణాచార్యుడు.

288. లోభము = పేరాస ; సిరి = సంపద ; అఁకొని = ఆకలిగొని ; ముసిండి = విషముష్టిపండు ; మంత్రితము = ఆలోచింపబడినది ; తంత్రము = వ్యవహారము.

289. లాతులై = వేరయినవై ; దోః + దర్పము = బాహుబలము ; పెరవారిని = ఇతరులను ; కూడబెట్టెదవు = చేర్చెదవు.

290. ఈరసము = ఈర్ష్య ; ఎత్తికోల్ = ఉత్సాహము ; తప్పఁజూచు = చెడగొట్టు.

292. శూలాయుధుడు = శివుడు

293. సవ్యసాచి = ఎడమచేతితోఁగూడా బాణములువేయు నేర్పుగల వాడు, కార్శ్యము = మాటలనిభావము.

294. ఉక్కు = బలము, ఉద్దవిడిన్ = శీఘ్రముగా

295\. తోడువోన = సహాయము, కొలది = శక్తి. ఉరిది = అసంభవము

296\. అసుగుమాలిపోవుసురు = చచ్చెదరు. సీకుగా = నీకొరకు (యుద్ధములో), దూఱు = నింద

297\. పోల్చి = ఒప్పగ, సఖ్యతన్ = స్నేహముగా, అనురక్తమతిన్ = అనురాగముగల బుద్ధితో

299\. చెడుతెరువు = చెడిపోయేమార్గము, పంపు = ఆదేశము

300\. లోకంబులు రెండింటికి = ఇహపరములకు

303\. ప్రచయము = సమూహము, పోవన్నా = పడచుకొనవయ్యా.

304 పదంపడి = తరువాత (పదపడి రూపాంతరము)

306\. కృష్ణుడు = అర్జునుడు, వాసుదేవుడు అని నానార్థములు, ఇభపురము = హస్తినాపురము.

308\. ఎఱగు = నమస్కరించు; సంగతము = కలియునట్లుగా, తిగిచి = పైకెత్తి, తళుకొత్త = ప్రకాశింప, తామరతంపర అయిన = బహుసంఖ్యాకమైన, పేరు + ఎలమి = మిక్కిలి ప్రీతి.

309\. కటకములు = సేనావారములు

311\. ఇప్పరుసున = ఈవిధముగా

312\. పఱచుట = పాటువడజేయుట (అవమానపఱచుట) ఇడుములు = కష్టములు. జూదరివెంటన్ = (జూదరి స్వభావము చొప్పున అని భావము)

313\. తమకించి = ఉత్సహించి; ముష్కరుడు = దుర్మార్గుడు; అక్షప్రౌఢి = పాచికల నేర్పు; పూట = బాధ్యుడు.

315\. ఉక్కుఱి = బలముపోయి; ఊటడి = పూని; మొనతలన్ = రణాగ్రమున, అక్కజముగ = ఆశ్చర్యకరముగా

316\. ~~క్రచ్చఱన్ = మరల~~ త్రచ్చఱన్ = శీఘ్రముగా;

317\. చవి = రుచి, కలుచ = దోషము, క్రోధము, చూఱ = దోపిడి

318. భూమిదొనర్చి=భూమిని భాగమొనర్చి యనిభావము.

319. అలతి=కొద్ది, చెలువు=విధము, పొలుపు=అందము, పుండరీకాక్షుడు=శ్వేతకమలములవంటి కళ్లుగలవాడు, అరుణకమలాక్షుడు ఎఱ్ఱకమలములవంటి కళ్లుకలవాడు (అనగా కోపగించినవాడని భావము)

320. తడవు=ఆలస్యము, భండనము=యుద్ధము, ఎల్లి=రేపు, ఊటు=ఊరడించుట

321. ఉడుగక=మానక, ఎగ్గు=అపకారము, పెను+పాములు=పెద్ద పాములు, నెగడి=వర్ధిల్లి, రాచసిరి=రాజ్యలక్ష్మి, చూపు+ఓపక=చూడజాలక

322. నెత్తము=జూదము, తడవు=వెదకు

325. దానిక=అందుకొరకే

326. కటకటంబడుట=కోపించుట

327. కర్జంబు=కార్యము ప్రీతిన్=ప్రేమతో, ఉనికి=ఉండుట, బుద్ధిన్=బుద్ధి వెంబడి

328. కొలువు=సభ, ఆత్మజనకున్=తనతండ్రియగు ధృతరాష్ట్రుని

329. అనుజగణము=సోదర సమూహము, గోరడము=ఎగతాళి, (దేశ్యము) ప్రోవు=గుంపు, అమ్మొయిన్=అవిధముగా

331. వృథాభిమాని=వ్యర్థమైన అభిమానము గలవాడు, అసంగతము=అయుక్తము, అతిభారపు మానుసులు=కఠినాత్ములు, (భారీ ఎత్తు మనుష్యులు అని ఎకసక్కెము)

332. ప్రతతి=సమూహము, నగధరుండు=కృష్ణుడు

333. నాచేన్=తనచేత (దుర్యోధనునిచేత)

334. కందుట=తపించుట, ఉత్తంసము=సిగబంతి

355. ఉబవు=ఔచిత్యము

336. ఉదరిపడు = త్రుళ్ళిపడు

339. పొలతుక = స్త్రీ, (పొలతి)

342. జేవురింపగ = ఎఱ్ఱపడగా, విదురసంప్రార్థితుడై = విదురునిచేత ప్రార్థింపబడినవాడై (పిలువబడినవాడై)

343. దుర్మంత్రంబు = దురాలోచన

344. తలపు = అభిప్రాయము, క్రొవ్వాఱన్ = బలహీనుల మగునట్లుగా, కరము = ఎక్కువ

345. వెసన్ = తొందరగా, కడంగి = యత్నించి, చలము = మాత్సర్యము (పట్టు), డింపకుడు = వదలకుడు, తనకున్ మును = అతని కంటె ముందుగా

346. తెగక = నిరాశపడక, నిర్జించుట = జయించుట, ఉరగము = పాము

347. అవినీతులు = దుష్టులు, దైతేయమర్దనుడు = రాక్షసులను సంహరించినవాడు (కృష్ణుడు) మర్దింపన్ = కొట్టగా (చంపగా)

348. అడఁకువ = వినయము, అల్కి = భయపడి, ఉరియాడు = కళవళపడు, క్రందు = ధ్వని, సంకులము = గందరగోళము

349. బఱటి = సైగజేసి, (గోకి) పన్నన్ = పన్నుగడ, పన్ని (రక్షకులను నిలబెట్టు) అన్నదెసన్ = కృష్ణుని విషయమున, హార్దిక్యుడు = కృతవర్మ

350. పుచ్చి = పంపి

351. పైఁబారజూచెదరు = మీదికిరా ప్రయత్నించుచున్నారు, అమ్మై = అవిధము, తీరునే = సాధ్యమగునా ?

353. మర్త్యుడు = మరణశీలుడగుమానవుడు, కిట్టిన = సమీపించిన, → వావిరిన్ = క్రమముగా, శలభవర్గము చాడ్పున = మిడుతలదండు వలె, మ్రందుట = చచ్చుట

355. సేఁత = పని, పాత్రిభవము = ప్రభుత్వము, ఓపుగతి = చేతనైనట్లు దుర్జయులు = జయింప శక్యముకానివారు, అంతక = అంతతో

356. పనుచుడున్ = పంపగా

358. అలవి = శక్తి, సమీరుడు = వాయువు, చోఁకు = ఆవేశము చమరుట = అరచేతితో కొట్టుట

359. తొడఁగి = మొదలుపెట్టి

360. కను+ఎదురు = కన్టెదురు = ఎట్టఎదుట, వహ్ని = అగ్ని మండిత=అలంకరింపబడిన, ప్రహరణము=ఆయుధము. ఊరులు= = తొడలు, విన్యస్తములు = ఉంచబడినవి, శ్రోత్రము = చెవులు, జాలము = సమూహము, కలాపము = సమూహము తరణి = సూర్యుడు, నిభ = సమానమైన, జొత్తిల్లు = రంజితము లైన, ఒలయన్ = పుట్టగా, సాంద్రము = దట్టము

361. వ్రాతము = సమూహము, శ్రేణి = పంక్తి చదలన్ = ఆకాశ మున

363. సంశ్రిత – ఆశ్రయించినవారి, ధురీణా – సమర్థుడా ?

364. పూరము – ప్రవాహము, సంహరింపవే – ఉపసంహరింపవే

365. సిత = తెల్లని, నిమగ్నము = మునిగినది

366. సముత్థానముసేసి – లేచి, మొగంబు గంటువెట్టుకొని – కోప ముచే మొగముముడుచుకొని, నొగలు – సారథికూర్చు నేస్థలము, కేలు = హస్తములు, గదియించిన = చేర్చిన

367. వేరము – వైరము, పొసగి – కూడి, మన్కి – ఉండుట, పోరితమాడి – బలవంతపెట్టి, గదాధర – కృష్ణా.

369. కోటి – సమూహము.

371. మేదినీ – భూమి.

373. అంభోరుహము – పద్మము.

374. పూరములు – ప్రవాహములు, అల్పవచనములు – తేలికమాటలు.

375. మహిషి – రాణి.

376. క్రోయి – విషమముగా నాటుకలు వాచు, ఎసకము – అతిశయము.

378. ఒండు – మరియొక, ఓజ – క్రమము, ఉత్తమసత్త్వులు – ఉత్తమగుణములుగలవారు, నిస్తేజము – తేజోవిహీనమైనది.

379. వియ్యంబులు – బావలు (పాండవులు) పసిరి – ప్రయత్నించిరి. వీరిని – (దుర్యోధనాదులను) నెరవు – ఉపాయము.

380. ఉన్మేషము – వికాసము, వృత్తము – వర్తనము, కపిధ్వజుడు – (హనుమంతుడు ధ్వజమునందు గలవాడు) పొందు – సంధి మాన్యుడు – పూజింపదగినవాడు.

382. బన్నంబులు – కష్టములు, తొలంగన్ – వీడగా.

383. లావు – బలము, అనిచి – పంపి వేసరి – వాహనవిశేషము, కెలనన్ – ప్రక్కన.

384. ఉక్కునన్ – కూర్మితముగా, మగ్గుట – నశించుట, ఉక్కివులు – మోసగాండ్రు.

385. కెలంకులు – దిక్కులు.

386. బమ్మెరపోయితిమి – విభ్రాంతిజెందితిమి, బెట్టిదము – పరుషము తెగఁబాఱిరి – హద్దుమీరి మాట్లాడిరి, వారిరాశి – సముద్రము.

388. స్తుత్యంబుగా – పొగడబడునట్లుగా, ఏపు – ఆధిక్యము.

389. రాజుట – రగులుట.

390. దరిన్ – ఒడ్డునకు, తలకు – భయపడు, పొరలితిమి – నడుచుకొంటిమి (పాటుబడితిమి).

391. తలకొనన్ – అతిశయింపగా, అర్కతనయుడు – సూర్యతనయుడు (కర్ణుడు).

393. ఉపసేవి - సేవించువాడు, సంవేది - బాగుగా తెలిసినవాడు, మార్తాండుడు - సూర్యుడు, కన్నియతఱి - కన్యకగానున్నప్పుడు, ఎఱగి - నమస్కరించి.

394. ఛత్త్రంబు - గొడుగు, ధవళంబు - తెలుపైన, ప్రభృతి - మొదలైన, కవలు - నకులసహదేవులు, బెరయన్ - కూడగా.

395. అంచితముగ - పూజ్యముగ, సంచిత - సంపాదించిన, వేరు సేయక - భేదముచేయక అని భావము.

386. రాధేయుండు - రాధ అను పేరుగల సూతునిభార్య కుమారుడు (కర్ణుడు).

397. వెడవెడన్ - కొద్దికొద్దిగా, తొల్లి - ముందు, ప్రియ - ప్రియురాలు (భార్య).

398. పురీషము - మలము, గాత్రము - శరీరము, సంవర్ధిత - పెరిగిన, కూర్మిన్ - ప్రేమతో

399 ఒరువుడు - ఇతరుడు, తొరగినన్ - తప్పుకొన్న, ఫోడిమి - సౌందర్యము, వాడి - కరకుదనము, శౌర్యము

400. సంవేదనము - ఎరుక

403. అర్గలము - అధికము, ఊది - ఆధారముజేసికొని, ముట్టవచ్చినన్ - యుద్ధసమయమున

404. వమ్ము - వ్యర్థము, నమ్మిగ - (నమ్మిక రూపాంతరము)

405. ఎక్కటెక్కటిన్ - ఒకనితోనొకడు

409. ఋత్విక్కులు - యజ్ఞముచేయించువారు, ఉపద్రష్ట - యజ్ఞాది కర్మలయందలి గుణదోషముల కనిపెట్టి చూచువాడు, విశసనము - వధ (శమింపజేయుట)

411. స్మయము - గర్వము, ఒండెన్ - కాని

412. కవదోనలు - అంబులపొదులద్వయము, అడరన్ - ప్రజ్వలించగా

413. సైంధవము – లవణము, యవ – యవధాన్యము, సులభము – తేలికగా దొరుకునది, ఉపేతము – కూడినది, కానీనుడు – కన్యాపుత్రుడు (కుంతి కన్యకగానున్నప్పుడు పుట్టినవాడు కర్ణుడు)

414. నిమిత్తము – శకునము, పోటు – పోరు.

417. దటియన్ – గట్టుచేరునట్లు, పసివినియొదను– సెలవుతీసుకొనెను, ఆటోపము – తొందర.

---

# సామెతలు - జాతీయములు

1. డెందానన్ చెయివెట్టికొని నిద్రించు.
2. పామున్నయింటిలో ఉన్నయట్లు
3. ముక్కున నావిగలుగ
4. పాలును నీరుబోలె
5. తలయెత్తిచూడన్
6. మిన్నును నేలయు తిరుగంబడినను
7. పదనికి రాన్
8. చవుటఁబెట్టిన విత్తుల చందము
9. చిత్తమునకు రాకుండినన్
10. ఒకళ్లు పసరమునడచిన ఒక్కళులు పెయ్యనడచవలయునే
11. మెత్తబడుట
12. ఎరుంగమిబెట్టు.
13. చిచ్చొడింగట్టిన యట్లు.
14. పాలలో బడిన బల్లివిధంబున.
15. ప్రాణము మేని కంతకున్ వచ్చుట.
16. మొగంబు గంటువెట్టుకొనుట.
17. మొగులు ముట్టుట.
18. ముకుద్రాట కాలు గ్రువ్వనేల.
19. అడుగు మాలి పోవుట.
20. సిరి రా మోకాలొడ్డుట.
21. తామర తంపర.
22. కోరలు బుచ్చిన ఉరగము.
23. అనలంబుఁ జీర బంధించుట.
24. దరి త్రొక్కినవారము
25. మొగంబురాజుట.

---

# ఛందస్సు

ఒక హ్రస్వమైన అచ్చును పలుకుటకు పట్టేకాలాన్ని మాత్ర అంటారు. అ, ఇ, ఉ మొదలైనవి.

ఒక మాత్రగల అక్షరానికి లఘువని పేరు. అంతకంటె ఎక్కువ మాత్రలు ఉన్న అక్షరానికి గురువని పేరు. దీర్ఘాక్షరాలూ, (కా, నీ, మొ॥) పొల్లులతో కూడిన లఘువులూ, (నన్, పల్. మొ॥) విసర్గతో కానీ నిండుసున్నతో గానీ కూడుకున్నవి (దుఃఖము. సంగతి మొ॥) సంయుక్తాక్షరానికి పూర్వంలో ఉన్న లఘువున్నూ (కర్జము మొ॥) గురువులు.

సాధారణంగా మూడు అక్షరాలుగల సమూహానికి గణ మని పేరు. ఈ అక్షరాలు గురు, లఘువుల ఏర్పాట్లనుబట్టి, ఈక్రింది విధంగా ఏర్పడతవి. లఘువు గుర్తు (ల) I, గురువు గుర్తు (గ) U.

| | | | | |
|---|---|---|---|---|
| సర్వగురువు | UUU | శ్రీరామా | మ | గణము |
| సర్వలఘువు | III | వ ర ద | న | – |
| ఆదిగురువు | UII | శ్రీ క ర | భ | – |
| మధ్యగురువు | IUI | ము రా రి | జ | – |
| అంత్యగురువు | IIU | క రు ణా | స | – |
| ఆదిలఘువు | IUU | ము రా రీ | య | – |
| మధ్యలఘువు | UIU | శ్రీ ప తీ | ర | – |
| అంత్యలఘువు | UUI | శ్రీ రా మ | త | – |

ఇవి జ్ఞాపకంపెట్టుకోడానికి అనుక్రమతంగావచ్చే పద్యాలు వెల్లంకి తాతంభట్టు సులక్షణసారంలో సంగ్రహింపబడినవి.

క. గురువులు మూడిడ మగణము
పరగంగా నాదిగురువు భగణంబయ్యెన్
ధరమధ్య గురువు జగణము
(సరసగుణా) యంత్యగురువు సగణంబయ్యెన్.

క. నగణంబు మూడు లఘువులు
యగణంబున కాది లఘువు (యమతనయనిభా)
రగణంబు మధ్యలఘువగు
తగణంబున కంత్యలఘువు (దాక్షిణ్యనిధీ)

క. లలమునకు రెండు లఘువులు
వలనొప్పగ లఘువు గురువు వగణంబయ్యెన్
గలమయ్యె గురువు లఘువును
(జలజాక్షా) గగమనంగ జను గురుయుగముల్.

క. నగణము పయి గురువున్నన్
నగమగు లఘువున్నయెడల నలమగు వరుసన్
వగణము పయి లఘువున్నన్
దగనలమగు (గంజహిత సుధాకరనయనా)

క. నల, నగ, సల, భ, ర, తలు నా
నెలమిని నీయాఱు గణము లింద్రగణంబుల్
గల, నగణము లీ రెండును
జలజాప్తగణంబు లయ్యె (జగదాధారా)

క. గల, నగణము లినుఁ డింద్రుఁడు
నల, నగ, సల, భ, ర, త, లింక నగగ, నహ, సలా,
భల, భగురు, మలఘు, సవ, సహ
తల, రల, నవ, నలల, రగురు తగ వింద్రుఁ డజా.

క. గగణం బగు నేక గురువు
లగణంబగు నేకలఘువు లాలితమనగా
వగణమగు లఘువు గురువును
హగణంబగు గురువులఘువు, (హరిభక్తవదా).

ప్రాస :— పాదద్వితీయాక్షరాలన్నీ సమానంగా ఉండాలి. [redacted] యతి మైత్రి ప్రతిపాదం మొదటి అక్షరానికీ, పాద మధ్యంలోఉన్న ఒక్క అక్షరంతో అచ్ ద్వారానూ, హల్లు ద్వారానూ కల మైత్రి

ప్రధానవృత్తములు :—

ఉత్పలమాల :— భరనభభరలగ — 10 వ అక్షరము యతిమైత్రి

చంపకమాల :— నజభజ జజర — 11 ,,

మత్తేభము :— సభరనమయ వ(-లగ) 14 ,,

శార్దూలవిక్రీడితము :— మసజసతతగ 13 ,,

జాతులు ; ఉపజాతులు :— వీటికి పైనిచెప్పిన గణాలుకాక సూర్య ఇంద్రగణాలు వాడతారు.

సూర్యగణములు :— న, హ (గల UI) గణములు

ఇంద్రగణములు :— భ, ర, త, నల (IIII) నగ, సల నల - నగణముపై ఒక లఘువు.

సీసపద్యము: ఒక్కొక్క పాదంలో 6 ఇంద్రగణాలూ, 2 సూర్యగణాలూ ఉంటవి. 1-3 గణాల ప్రథమాక్షరాలకూ 5-7 గణాల ప్రథమాక్షరాలకూ యతిమైత్రి ఉంటుంది. ఎప్పుడయినా ఈప్రథమాక్షరాలకు మైత్రి లేకపోతే రెండవఅక్షరాలకు ఉంటుంది. దానికి "ప్రాస యతి" అనిపేరు.

తేటగీత:— ఒక్కొక్క పాదంలో సూ+2 ఇం+2 సూ. 1-4 గణాల ప్రథమాక్షరాలకు యతి,-ప్రాసయతి కూడా చెల్లుతుంది.

ఆటవెలది:— బేసిపాదములలో 3 సూ+2 ఇం, సరిపాదములో 5 సూ 1-4 గణాల ప్రథమాక్షరాలకు యతి మైత్రి ప్రాసయతి.

కందము :— ఇందులో నాలుగుమాత్రలు గల గణాలనే వాడాలి. అంటే, భ, జ, స, నల, గగ గణములే. బేసి పాదాల్లో ఇట్టివి మూడుగణాలూ, సరిపాదాల్లో ఐదుగణాలూ ఉండాలి, సరిపా

— దాల చివర గురువు అంతమందుగల గణము (స, గగలలో ఒకటి) ఉండాలి. జగణం సరిపాదాలల్లో సరిగణంగానూ, బేసి పాదాలల్లో బేసిగణంగానూ ఉండకూడదు. యతి సరిపాదాలల్లో మాత్రమే నాల్గవ గణ ప్రథమాక్షరము.

మిత్రాచ్చులు :— (i) అ, ఆ, ఐ, ఔ, య, హ.
(ii) ఇ, ఈ, ఎ, ఏ, ఋ, ౠ, ఌ, ౡ,
(iii) ఉ, ఊ, ఒ, ఓ,

సామాన్యముగా ఏకవర్గమునకు చెందిన నిరనునాసికాక్షరములు పరస్పర మిత్రములు.

---

# గణవిభజనకు — మైత్రి

యతి మైత్రి స్థానముక్రింద గీత చూడుడు.

(i) ఉత్పలమాల —

శావున | శాంతిబాం | దుటయ | క్కర్జము | దానది | యట్టులుం | డెశ్రీ
భ ర న భ భ ర లగ

(ii) చంపకమాల —

అనుట | యుఃబిన్న | నవ్వున | గియ్యంబు | జనాభు | డువల్లు | నెన్నడున్
న జ భ జ జ జ ర

(iii) మత్తేభము —

సుతువా | డ్వైవిన | యంబుచే | కొనక | యేచ్చాప్పం | దగంజె | ప్పకా
స భ ర న మ య వ-(లగ)

(iv) శార్దూలవిక్రీడితము —

పాపాత్ముం | డుమదాం | ధుడాతు | లువనీ | ప్రంపెట్లు | నుంజేయు | గా
మ స జ స త త గ

సీసము :—

భ భ ర సల
గ్రోగ్రహా | ణంబునఁ | గ్రోలెనెం | తయుమొత్తఁ |
బ్రడకుండు | దురెవారు | ప్రద్మ | నాభ
సల సల హా హా

గీతము :—

నాకు | ధర్మజు | బుద్ధిన | న్నడప | వలయు
హా భ భ న న

ఆటవెలది :—

హా హా హా సల నగ
ప్రీతి | బొంద | నెవ్వ | రికి నేది | తగు బ్రిణా |

హా న స హా న

(సరి) మూాది | విధుల | నడపు | నాదు | పలుకు !

రెండవ పాదంలో ప్రాసయతి చూడు

కందము:—

వెఱపె | ట్టెదిరో | యెన్నడు |

స స భ

నెఱుగని | నీయ | ట్టివాని | కెవ్వరో | కో, యీా

నల గగ జ భ గగ



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 3 | హోమత్పరుడు | హోమతత్పరుడు |
| 5 | 4 | జగతిని | జగతిన |
| ,, | 10 | పోది | పాది |
| 7 | 26 | పదమునకు | పదమున |
| 12 | 24 | చిత్తవృత్తి | చిత్తవృత్తి |
| 14 | 9 | వరి | వర |
| 16 | 18 | నీవేల | నీకేల |
| 21 | 23 | దక్షౌహిణులును | డక్షౌహిణులును |
| ,, | 24 | కైకేయు | కైకేయు |
| 33 | 12 | గర్వింతురు | గర్వింతు |
| 41 | 23 | నొంద | లొంద |
| 43 | 27 | ధారరాష్ట్రి | ధార్తరాష్ట్రి |
| 49 | 3 | గదియు | గదియు |
| 50 | 20 | జెప్పిన | జెప్పన |
| 51 | 18 | చెలివంద | చెలిపొంద |
| 52 | 7 | నె | ని |
| 57 | 26 | యుటిపరము | యుటిమాపరము |
| 58 | 26 | వారును | వారు |
| 59 | 28 | ప్రమొక్కము | ప్రమొక్కము |
| 61 | 24 | కటకటం | కటం |
| ,, | 25 | బాపురె | బాపురె |
| 62 | 15 | ప్రతతితొల్ల | ప్రతతికొల్ల |
| 63 | 6 | తాన | గాన |
| 67 | 25 | కక్ష్యాంతరబులు | కక్ష్యాంతరంబులు |
| 68 | 26 | ఖడక | ఖడ |
| 69 | 10 | మ్రొనిన | మ్రొనిన |
| 72 | 17 | కొడుకులు | కొడుకులం |
| 77 | 27 | పొంది + కలసి, | పొంది — కలసి |
| 78 | 12 | చంపిన | చంపన |
| ,, | ,, | చంపటకు | చంపుటకు |
| ,, | 24 | ఏ | అ |
| ,, | 26 | ఆనభిమతము | అనభిమతము |
| 80 | 26 | ఒంటె | ఒంటి |
| ,, | 27 | ఒంటరివాడనై | ఒంటరివాడనై |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 81 | 6 | రాక + అతనికిన్ | రాక + ఉనికికిన్ |
| ,, | 15 | ఏకనిష్ఠము | ఏకనిష్ఠ్యము |
| ,, | 16 | బలపంతులై | బలవంతులు |
| ,, | 18 | ఆశేష | ఆకేశ |
| 84 | 10 | ఊరకుండకు | ఊరకుండక |
| ,, | 13 | ఇ + మెయిన్ | ఈ + మెయిన్ |
| ,, | 18 | చోట | చోటు |
| 85 | 6 | కృష్ణుడు | కష్టుడు |
| 86 | 21 | వా | వాగం |
| 88 | 7 | 192 | 102 |
| ,, | 22 | 108 | 109 |
| ,, | 26 | 109 | 110 |
| 91 | 3 | మగేడిరి | మగిడిరి |
| 92 | 4 | వాసుదేవునియెడ | (అను దానిని తీసివేయవలెను) |
| 93 | 20 | పయివెట్టుట్టు | ప్రయివెట్టుట |
| 94 | 17 | పెనపరి | పెనుపరి |
| 95 | 18 | ——— గండుష — పౌరుముబలము | + గండు — పౌరుషము, బలము |
| 99 | 24 | క్రచ్చుడన్ — మరల, | క్రచ్చఱన్ — శీఘ్రముగా |
| 100 | 25 | జౌచిత్యము | ఔచిత్యము |
| 103 | 16 | క్రూరముగా | కార్శ్యముచేత |
| 109 | 1 | కొన్ని పద్యాలు | (తీసివేయవలెను) |

